




గ్రంథకర్త
సురవరము ప్రతాపరెడ్డి బి. ఏ. బి. ఎల్.



ప్రకాశకులు.
గోలకొండ పత్రికాలయము,
తూర్పు బజారు, దక్షిణ హైదాబాదు,

వెల ౧౨ అణాలు

౧౯33



# అంకితము.

ఈ యుచ్ఛల విషాదనాటకము నత్యంత భక్తి ప్రీతులతో
స్వర్గీయులైన నా పితృవ్యులగు

## సురవరము రామకృష్ణారెడ్డి గారికి

అంకిత మిచ్చుచున్నాను.

వారు చాల ధార్మికులు, ఉదారులు, గొప్పదాతలు, దేవ బ్రాహ్మణ భక్తులు, నిర్మల స్వభావులు, పరస్త్రీల మాతలట్లు త్రికరణ శుద్ధిగా భావించెడివారు. నా యెడ నత్యంత ప్రీతిఁజూపిన వారు. నా విద్యకు వారే కారణులు. నన్ను బలవంతముచేసి జదివించిరి. ఉర్దూ సంస్కృతాంధ్ర భాషలందుఁ బ్రవీణతకలవారు. సంస్కృతమందు మాత్ర మత్యంత ప్రేమకలవారు. వారు గత సంవత్సరము కార్తీక శుక్ల ఏకాదశీ పుణ్యదినమున నాకస్మికముగ తట్టుకొని క్రిందపడి యాక్షణమే ప్రాణములవీడి యుత్తమ మరణముబొందిరి. చనిపోవునప్పటికి వారి వయస్సు ౬౦ సంవత్సరములు.

ఇట్లు,

సురవరము ప్రతాపరెడ్డి.

## —— తొలిమాట ——



ఈ యుచ్ఛలనాటకము కాశ్మీరదేశ ప్రాచీన పండిత గ్రామణియు నుచ్ఛలు సమకాలికుఁడునగు కల్హణునిచే సంస్కృతమంను వ్రాయఁబడిన „రాజతరంగిణి'' యనునుత్తమచారిత్రిక గ్రంథము ననుసరించి రచింపబడినది దీని నేను ౧౯౨౧ వ సంవత్సరములోనే వ్రాసితిని. ఇప్పటికైనను ముద్రింపఁగలిగితిని. ఈ నాటకమునకు మూలమగు కల్హణుని „రాజతరంగిణి'' లోనికథను సూక్ష్మముగా నిందువ్రాసిన పాఠకులు నాకావించినమార్పులు మంచివో కావో నిర్ణయించుకొనఁ గలుగుదురు.

### ఉచ్ఛలుని వంశ వృక్షము




## మూలమందలి కథ

కాశ్మీరము నేలచుండిన హర్షరాజు చనిపోయిన యనంతరము ఉచ్ఛలుఁడు (క్రీ. శ. ౧౧౦౧–౧౧౧౧) రాజ్యాభిషిక్తుఁడయ్యెను. ఇతని తమ్ముఁడు సుస్సలుడు భ్రాత్రాజ్ఞచే కాశ్మీర దక్షిణ దిగ్భాగమందుండు లోహరయను మండలమును

రాజప్రతినిధిగాఁ బాలింప మొదలిడెను. సుస్సలుఁ డధికారము పొందినవెంటనే కాశ్మీరభాగమగు క్రమరాజ్యమందలి డామరులను ప్రబలులగు వ్యవసాయుల నిబ్బందిని దొలగించి మడవరాజ్యమందలి ద్రోహుల శూలారోపణము గావించెను. అవని యనుయాయియగు జనకచంద్రుని గొందఱు డామరులు రహస్యముగాఁ జంపిరి.

ఉచ్ఛలుని కిద్దఱుభార్యలు-పెద్దది జయమతి చిన్నది బిజ్జల. ఉచ్ఛలుఁడు కాయస్థులను (ఉద్యోగులను) శిక్షించెను. లంచగొండియగు భూతభిక్షుని వికృత వేషునిగాఁ జేసి యూరేగించెను. వేశ్యాలోలుఁడగు నింకొక యుద్యోగిని వేశ్యలతో సహా నాట్యమాడించెను. ఒకనాఁడొక వర్తకునివద్ద నిక్షేపముంచి వరల దానిని గోరిన ధనికునకీయ నిరాకరించిన యా దొంగకోమటిగుణమును ఉచ్ఛలుఁడు చాతుర్యముతో గుర్తించి విచారించెను.

ఉచ్ఛలునిలో నొండు రెండులోపము లుండెను. తన యుద్యోగుల లోపములు సహింపకుండెను. ద్వంద్వ యుద్ధములందుఁ బ్రీతిగలిగి యుండెను. దంచకుఁడు రక్కకుఁడు అనుమంత్రులు దుర్మార్గులగుటచే రాజభయమున పారిపోయిరి. భోగసేనుఁడు న్యాయాధికారిగా నుండెను. ప్రశస్తకలశుఁడు తుదివరకు విశ్వాసయుక్తిఁ గొలిచెను.

ఇట్లుండ సుస్సలుఁడన్నపై దండెత్తివచ్చెను. రాజతని నోడించి వెంబడింప గర్గచంద్రుని నియోగించెను. ఉచ్ఛలుఁడు శైవభక్తుడు. స్వయంభూదేవాలయమును నితర దేవాలయములను నందందుఁ గట్టించెను.

కొలదికాలమునకే రాజ పీడితులైన యుద్యోగులు—చుడ్డ, సడ్డ, రడ్డ మున్నగువారు — రాజుపై ద్రోహముసేయ మొదలుపెట్టిరి. సడ్డునితల్లితో మయ్యాపట్టపుసాఁడు వ్యభిచరించుచుండినందున సడ్డుఁడు వానిఁ జంపెను. ఇదివిని రాజు సడ్డుని బృహద్గంజ పదవి(కోశాధ్యక్ష పదవి)నుండి తొలగించుటయే కాక వాని తల్లిని శూర్పణఖనుగా జేసెను. సడ్డునికిది మనసులో నాటుకొనెను. హంసరథాదులను జతచేసికొనెను. భోగసేనునిగూడ వలలో వేసికొనెను.

ఒకనాఁడు రాజు రాత్రి భుజించి తన రెండవభార్యయగు బిజ్జలయొక్క సౌధమునకుఁ బోవుచుండ సడ్డాదులతని కడ్డమువచ్చిరి. ఒకఁడేదో మనవిచేసికొనఁ గోరినట్లు నటించెను. తేజుఁడను బ్రాహ్మణుఁడు రాజు జుట్టునుబట్టి వంచి బాకుతోఁబొడిచెను. రాజు ద్రోహము ద్రోహము అని కూతలిడుచు తన ఖడ్గధారి

యగు సుజనాకరుని ఖడ్గమందిమ్మని పిలిచెను. కాని వాఁడు పాఱిపోయెను. భోగసేనుని పిలిచెను. కాని యితఁడు కిమ్మనక గోడవైపు తిరిగి నిలుచుండెను. రాజా చచ్చెను. తర్వాత నాతనితమ్ముఁడు సుస్సలుఁడు రాజయ్యెను. ఉచ్ఛలుని మరణము ౪౧౮౧ లౌకికశకము (౧౧౧౧ క్రీ. శ) పుష్య శుద్ధ ౭ నాడు సంభవించెను.



# మార్పులు

—:o:—

మూలమందలి పైకథలో కొన్నిపేరులు శ్రుతికటువుగా నుంటచే నిట్లు మార్పఁబడెను.

వ్యడ్డ — తిలక
చుడ్డ — చూడసేన
సడ్డ — శ్రిద్ధాసేన
రడ్డ — ప్రయాగ
రయ్యావట్ట — రైవతక

మఱియు రాజా కిద్దఱు భార్యలుండగా నాటకమందు చిన్నభార్యనే వారికి స్థిరపఱచి పెద్దభార్యను వెడలించితిని.



# నాటకమందలి పాత్రములు.



ఉచ్ఛలరాజు:—కాశ్మీరరాజు.
సుస్సల:—ఉచ్ఛలుని తమ్ముఁడు.
గర్గచంద్ర:—సేనాపతి.
ప్రశస్తకలశ:—మంత్రి.

<table>
<tr><td>తిలక:—ఒక యుద్యోగి.<br>భోగసేన:—న్యాయాధికారి.<br>చూడసేన:—నగర రక్షకుఁడు.<br>శ్రద్ధాసేన:—కోశాధ్యక్షుఁడు.<br>ప్రయాగ:—శ్రద్ధాసేనుని తమ్ముఁడు.<br>హంసరథ:—ఉద్యోగి.<br>భూతభిక్షు:— ,,<br>తేజ:—తిలకుని బంధువు.<br>సుజనాకర:—రాజ ఖడ్గధారి.</td><td>} ద్రోహులు</td></tr>
</table>

రైవతక:—దీపధరుఁడు.
బిజ్జల:—ఉచ్ఛలుని భార్య.



# ప్రార్థనాంజలి

ఎవ్వఁడుశుద్ధుఁడైవెలుఁగు, నెవ్వఁడు కేవలుఁడైచెలంగునో
యెవ్వఁడునిర్గుణుండో; మఱియెవ్వడుసర్వము సృష్టిజేసెనో,
యెవ్వఁడచింత్యుఁడైతనరి యీభువనంబులనెల్ల దాల్చునో
యవ్యయుధామహేశు, ఁబరమాత్మను నాత్మను సంస్తుతించెదన్.

మిసిమివిసముల నెవ్వాఁడు మెసవుచుండు,
మణులఫణులను నెవ్వాఁడు మమతఁబూను
కలిమిలేముల నెవ్వాఁడు గలిగియుండు
నట్టి హరిహరనాథుని నాత్మఁదలతు.

రజపూత సీకు మరాటాంధ్ర ఘూర్ఖా మ
హావీరసమితినే యవనిగనియె.
జైన హిందూబౌద్ధ జరతుష్టముసలిమాన్
మతములకే భూమి మాతయయ్యె
వేదవేదాంగ వివిధ కళాశాఖలఁ
బోషించియేతల్లి పూజ్యయయ్యె
దర్శన వేదాంతతత్వప్రచారయై
జగతినే దేవి ప్రశస్తిగాంచె

అట్టి ప్రథిత హిందూస్థానమకట నేఁడు
పరులచేఁబడి క్షీణింప వలసెఁగాదె
దేవ! జగదీశ! మామాతృ దేశమునకుఁ
బూర్వ వైభవమొనఁగూర్చి ప్రోవుమయ్య.





# ఉచ్ఛ్రుల విషాదము.

## ప్రథమాంకము.

### ప్రథమరంగము

రంగము—శ్రీనగరము

ప్రవేశము:—(ఇద్దఱు డామరులు—తిలకుఁడు.)

డామ—జయ శ్రీమహారాజ ఉచ్ఛ్రుల మహీపాల!

తిలక—ఏమీ? ఉచ్ఛ్రులునికి జయమా? ఓరీ! మీ రెవ్వరు?

డామ—ఆర్యా! మేముకృషిచేసి బ్రతుకు బీదడామరులము. మీ రెవ్వరో యడుగవచ్చునా?

తిల—హర్ష మహీపాలసామ్రాజ్య స్థాపనోత్సుకుండనై యతనికి సహాయము చేయుచుండినయీ తిలకుని మీ రెఱుఁగరా? ఆసంగతి యటుండనిండు. మీరిప్పుడేల యీ శ్రీనగర వీథులందు పనిపాటలవదలి వ్యర్థముగాఁ దిరుగుచున్నారు?!

రె. డా—స్వామీ! నేఁడుచ్ఛ్రుల మహారాజుగారి పట్టాభిషేకోత్సవము జరుగును. ఆ వైభవమును జూచి యానందింప వచ్చినారము.

తిల—ఆ నైభవసందర్శనమా? ఎంతటియన్యాయము. ఏలికల మీ యనురాగము లెంతచంచలములో కదా; హర్షభూ యన్యాయముగా ద్రోహులైన యీ యుచ్ఛలుని య చరులచేఁ జంపఁబడగా లోకులందఱు దుఃఖింపలేదా? రాజేంద్రుని యవసానసమయమందు భూకంపాది మహో త్పాతములు దైవసూచకములని మీ రెఱుఁగరా! ఆతని శిరచ్ఛేదన మొనరించిన ద్రోహులవంశములన్నిఁ నాశమగుట మీకుఁ దెలియదా. అట్టి యుత్తముని గో పోయి యీ క్రొత్తవాని విషయమై మీకేల య సంభ్రమము?

ప్ర. డా—స్వామీ! హర్షపతి సామ్రాజ్యము దుష్టస్వప్నము నంతె మొందినది. మఁగిసినకథతో నిప్పుడేమి లాభము.

తిల—హర్షమహారాజుకన్న నీరాజేవిషయములందు శ్రేష్ఠు మీ రిప్పుడు సంతోషపడుచున్నారో తెలుపఁగలరా?

ప్ర. డా—సహాయహీనుఁడై యుండియు శత్రువులను గూడ మె చివారిని దనమిత్రులనుగాఁ జేసికొనిన గుణములే వాని ప్పఁదనమును జాటుచున్నవి.

ద్వి. డా—అందుచేతనే మా డామరనాయకులందఱు ... ములనీ యసహాయశూరునికిఁ దోడ్పడి రాజ్యభిషిక్తుని యుచున్నారు.

తిల—(స్వగతము) కట్టా! యెంతటి కష్టకాలము సంప్రాప్త య్యెను. (ప్రకాశముగా) డామరులారా! ఎట్టిక్రూరుని ఘింప సమకట్టితిరిమీరు. ద్రోహులచే నపహృతుఁడైన రాజాధిరాజగు హర్షుని శక్తిసామర్థ్యములందు శతాంశ న మీ యుచ్ఛలునికిఁగలదా? మీభావను లెంత చంచ ములోకదా.

గీ. సంచలించెడి మేఘంపు ఛాయ యనఁగ
పారుచుండెడి సెలయేటివారి విధము

మండు వేసవి జలతృష్ణ మహిమనొప్పి
ప్రతి నిమేషము వాడును బ్రజలమనము.

ఓరీ! డామరులారా! మీ యుద్యమము మంచిదికాదు. నా మాటవిని మీమీయిండ్లకరిగి కాలము వృథాచేయక మీ పనులఁ జూచికొనుఁడు.

ప్ర. డా—అన్నా! లోకులు భిన్నాభిప్రాయులు. నామాట నొకటి వినుఁడు.

గీ. సుందర ప్రసూనములచే సొబగుమీఱు
లతల నరకఁజు పోషింత్రు సతతమెటుల
బాగు రత్నాంచితకిరీటధారియైన
యుచ్ఛలునట్లు పొందు మా యూడిగముల.

("జయ శ్రీమహారాజా" అని లోపల ధ్వని వినఁబడును.)

(ద్వి. డామరునితో) మిత్రమా! జయజయధ్వనులు మిన్ను ముట్టుచున్నవి. తలసించిన రాజుగారి యభిషేకోత్సవమును జూచుభాగ్యము మనకు లభింపనేరదు. కావున శీఘ్రముగాఁ బోవుదము రమ్ము. (నిష్క్రమింతురు)

ల—(స్వగతము) హా! యెంతటి విపరీతకాలము సంప్రాప్తమయ్యెను.

తే. శిశిరమున పత్రములు రాలి చెదరినట్లు
ప్రజలు ద్రోహులై హస్తిని బాసిచనిరి
కిసలయంబు లామనివేళ నెసఁగినట్లు
ఉచ్ఛలాధిపుఁ జేరిరి తుచ్ఛజనులు.

ఒహ్హో! సామాన్యజనులీ యుచ్ఛలునిపై నెంతప్రీతిగలవారైరి, కానిమ్ము. సమయమునకై వేచియుండెద. ఈ యుచ్ఛలుని కత్యంతమిత్రముగా సహాయము చేసినవారిలో జనకచంద్రుడు ముఖ్యుడు వానిని తత్క్షణమే వధింపకుండిన నామనస్సునకు శాంతియుండదు. ఇదియే నా ప్రథమకర్తవ్యము.

(నిష్క్రమించును.)

# ఉచ్ఛలవిషాదము

## ద్వితీయరంగము

రంగము:— శ్రీనగరము.

స్థలము:— రాజసభామంటపము

(ప్రవేశము:— గర్గచంద్రుఁడు, ప్రశస్థకలశుఁడు.)

గర్గ— మంత్రీశ్వరా! మన రాజుగారికి సర్వ కార్యములందున సహాయకారియై యుండిన జనకచంద్రుఁ డెచ్చటనో కనఁబడకయున్నాడు. అతని సంగతి మీ కేమైనఁ దెలిసినదా?

ప్రశ— గర్గచంద్రా! ఇం కేమైయుండును? రాజ్యమంతయు నింతవఱకుఁ గల్లోలముగా నుండెనుగదా. శ్రీహర్ష రాజ పక్షమందుండిన వారెవరైన నీతని రహస్యముగా వధిం యుందురని నాకు సందేహము కలుగుచున్నది.

గర్గ— ఏమీ! అంతటి ఘోరకార్యము జరిగియుండునా?

ప్రశ— లేకున్న నతని జాడయే తెలియని కారణమేమి?

గర్గ— (తెరవంకఁ జూచి) ఉచ్ఛలభూపాలుఁడును నతని సో దైన సుస్సలరాజును నేతెంచుచున్నారు.

(దౌవారికుడు ప్రవేశించి) స్వామీ! మహారాజు గారు యువరాజులతోఁ గలసి వచ్చుచున్నారు.

(ప్రవేశము:— ఉచ్ఛలుఁడు, సుస్సలుఁడు.)

ఉచ్ఛల— గర్గచంద్రా! ప్రశస్థకలశా! నా క్లేశములందు విశ్వా ముతోఁ బాల్గొనినట్టి మన జనకచంద్రుఁడేలొక్కో నాఁడు నా సంతోషములందుఁ బాల్గొనఁ గోరలేదు.

గర్గ— భూపా, అతఁ డెచ్చట నున్నాఁడో, యాతని కేమి టంకములు గలిగినవో యూహింపఁ జాలకున్నా నే నిక్కార్యమునకై కొందఱఁ జారుల నియోగించి న్నాఁడను? వారింతలో రాఁగలరు.

ఉచ్ఛ— అతని కేమియు నపాయము నాటిల్లదుకదా?

ప్రశ—ఇప్పుడేమియుఁ జెప్పఁజాలము.

( సేవకుఁడు ప్రవేశించి )

మహాప్రభో! ద్వారముకడ చారులు కొందఱు తమ యను జ్ఞకై వేచియున్నారు.

ఉచ్ఛ—వారిని తత్క్షణమే లోపలఁ బ్రవేశపెట్టుము.

( చారులు ప్రవేశించి )

దండము! మహాప్రభో! దండము (నమస్కరింతురు)

ఉచ్ఛ—( చారులతో ) ఓరీ! మీ రేమి తెలిసికొని వచ్చితిరో త్వరగాఁ జెలుపుఁడు.

ఒకచారుడు—దేవరవారు చిత్తగింప వలయును. మా యుక్తి కొలఁది మేము జనకచంద్రుని జాడ నెఱిఁగితిమి. మొన్న నీతఁడు తిలకునిచే బృహత్సేతువు దగ్గఱఁ జంపఁబడి సరస్సులోఁ ద్రోయఁబడెను.

ఉచ్ఛ—ఏమి! ఏమి! చంపఁబడెనా? నిజమా? హా! యెంతటి ఘోరవార్త! ఎంత యన్యాయము! హర్షరాజును సేవించి ప్రసిద్ధినడసిన తిలకుఁడే యిట్టి నీచకార్యమునకు నిట్టి పందతనమున కొడఁబడెనా? ఓరీ! ఆ నీచుని బంధించి తెచ్చినారు కదా.

చారు—స్వామీ క్షమింప వలయును. మే మతని వెదకి జాడల గుర్తించువఱకే యాతఁడు మన రాష్ట్రపుఁ బొలిమేరను దాటి వెడలిపోయిన సంగతి తెలిసికొంటిమి.

ఉచ్ఛ—ఎంత ప్రమాదము! ఎంత ప్రమాదము!

గీ. ఖ్యాతి గాంచిన శత్రువు నణఁచివైచి
మాయమయ్యెడి దుష్టుఁడు మాని యగుచు
వృక్షమును హతాత్తుగఁ గూల్చి వేగిరంబె
ప్రక్కలిలో లీన మయ్యెడి వజ్ర మనఁగ.

ప్రశస్థకలశా, ఈ తిలకుఁడు మన రాష్ట్రమం దెచ్చటనైనను గనఁబడిన నిక్షణమే వానిని బంధించి నావద్ది కంపవలయునని యాజ్ఞాపత్రికల సలుగడల కంపుము.

ప్రశ—చిత్తము. మీ యుత్తరవు నేఁడే కావింపఁబడును.

సుస్స—అన్నా! ఈ తిలకుఁడేకాక యితర డామరులుసైతే మఱి దుష్టులని నా యభిప్రాయము. వీరెల్లప్పటికిని గయ్యముల కుఁగాలుద్రవ్వుచుందురు. కావున వీరి నందఱను ఒరిమార్చినగాని భూపతికి క్షేమముండదు.

ఉచ్ఛ—సుస్సలా! కొందఱు సేయు దుష్కార్యములకై యందఱను హింసించుట నీతిగాదు. అయినను మహాత్ములగు డామర నాయక ప్రముఖులకు నాధాక నెరింగించెద. పూర్వమునుండియు రాజుల నుచ్చస్థానమున నెలకొలపిన దీ డామరులే. వారి నా స్థలములనుండి పర్వతాగ్రములనుండి శిలలరీతి దొర్లించినదియు నీ డామరులే.

గీ॥ సర్పముల కెల్ల ఘనవిషజ్వాల లెట్లొ
క్రూర జంతు సంతతికెల్లఁ గోఱలెటులొ
దావ రేంద్రులకట్లు ఖడ్గములు గాన
మకుట రక్షణార్థులు దీని మఱవఁ జనదు.

గర్గచంద్రా! మనరాజ్యమున నెందు డామరులు గుఱ్ఱముల పై స్వారిచేయఁగూడదనియు, కత్తిసాముగాని, కర్రసాముగాని, సేర్వఁగూడదనియు, మాయనుమతిలేని దెబ్బసభలును జేయఁగూడదనియు కత్తిగాని, బల్లెముగాని, తుపాకి బరువైన లాఠీగాని, బట్టఁగూడదనియు మాయీమాట నల్లంఘించువారినిఁ గఠినముగా శిక్షింతుమనియుఁ జాటింపఁజేయుము.

గర్గ—చిత్తము. అట్లేకాఁగలదు.

—(చారులతో) చారులారా! మీకీ రాష్ట్రములోని సంగతు లం గనుగొనుచు ముఖ్యముగా మాయుద్యోగులు ప్రజల నేమాత్రమైన హింసించిన నా సంగతి మాకెఱింగింపుచుం డుడు. ఇప్పుడు మీరు పొండు.

లు—(నమస్కరించి) దండము మహాప్రభో! దండము.

[నిష్క్రమింతురు]

—ఓయీ! చమూపతీ! హర్షునితోడి యుద్ధములందు మాకు ద్రోహులై వర్తించిన డామరులంబట్టి తెప్పింపుము. వారి కుచితశిక్షల నీ వవలయును.

— సిద్ధముగా నున్నాడ.

—సుస్వలా! ఈకాశ్మీర రాజ్యపు దక్షిణభాగమైన లోహార రాష్ట్రమునందు మనకుఁ బ్రతికూలురైన వారనేకులు కలరు. కావున నీవందుండి యీ రాజ్యమునుఁ బాలించుచు మనప థమును శత్రుకంటక విరహితముగ నొనరించుట మంచిది.

—అన్నగారు సెలవిచ్చినట్టులే చేయువాఁడను. త్వరలో నేఁ యాణమయ్యెదను.

—సేనాపతీ! డామరనాయకులు కొందఱు బలోన్మత్తులై రా జశాసన ప్రతికూలురుగా నుందురు. అట్టివారిని యుక్తితో సాధింపవలయును. వారిలోఁ బరస్పర ద్వేషములఁ గల్పించి వారిని స్వయంగ్య యుద్ధ . లకుఁ బ్రేరేపించి వారిని నాశనము చేయుచుండవలయును. ఈ యంశమును బాగుగా జ్ఞాపక ముంచుకొనుము. తెలిసినదా?

—చిత్తము! మహారాజుగారి యభిప్రాయానుసారముగా వర్తిం చుచును.

ఉచ్ఛ—మంత్రీ! రాజ్యమును సంపాదించుట కష్టసాధ్యమైన పని. సంపాదించినదానిని నిలుపుకొనుట కష్టతరమైనది. రాజధర్మము సామాన్యమైనది కాదుసుమా?

సీ. పరపీడనైక జీవనవృత్తి లేకయుద్యోగులు నమ్రులైయుందురెచట
పరదార విత్తాపహరణోద్యతులుగాక సభ్యులై ప్రజలుండ్రనుతతమెచట
న్యాయవిక్రయము సేయక ధర్మబద్ధులై స్థేయపుంగవులు వర్తింతురెచట
సర్వమతములందు సమదృష్టినెఱపించి పాలించురాజులు బహుళమెచట

గీ. అట్టిరామరాజ్యంబున నఖిలజనము
ఈతిబాధా విముక్తులై యెల్లవేళ
లందుఁ బూర్ణసంతృప్తులై యలరుచుండ్రు
తదితరమరయ నరకంబుతథ్యముగను.

ప్రశ—మహారాజుగారు సెలవిచ్చిన యీ భావము లుత్తమాదర్శములు.

ఉచ్ఛ—ప్రశస్తకలశా! హర్షరాజు కాలమున నుద్యోగులై యుం[illegible]
యు మనకుఁ బ్రతికూలతఁ జూపినట్టి శ్రద్ధాసేనని చూడాసే[illegible]
నునిఁ దమతమ స్థానములందే నియోజించితిమి. మఱిఁ[illegible]
భోగసేనునివంటి న్యాయమార్గానలంబకులు మనరా[illegible]
మున నరుదు. కావున నీతని న్యాయాధికారినిగా నే[illegible]
టుచేయుచున్నాము. ఈ యేర్పాటుల నందఱకును [illegible]
యఁ జేయుము.

సుస్సల—భోగసేనుని యుద్యోగపదవిని విని సంతసింపని [illegible]
వ్వరును నుండరని తలఁతును.

ఉచ్ఛల—సోదరా, నీవాక్కు గంభీరభావగర్భితమైనది. [illegible]
వారి విషయములో నీ యభిప్రాయ మెట్టిదో యిం[illegible]
వెల్లడింపుము.

సుస్సల—బద్ధద్వేషియగు హర్షునివలన సన్నుతపదవుల సం[illegible]
చిన శ్రద్ధాసేన, చూడాసేనులు, మనపైన ద్వే[illegible]

చూపకున్నను శత్రుపక్షమువారై యుండిన వార్కొందఱయే చాలును మనము వారి విషయమై జాగరూకులమై యుండుటకు.

ఉచ్ఛల—సుస్సలా, మనము నిర్హేతుకముగ వందఱను ననుమానముతోఁ జూచుట పాడికాదు. మన విశ్వాసమును మఱచి ద్రోహులగుటకు వారు సాహసించెదరా? మంత్రీ, సేనాపతీ, మీ యభిప్రాయమేమి?

మంత్రి—దేవరవారి యభిప్రాయము సమంజసముగా నున్నది.

గర్గ—ద్రోహ మెప్పటికిని బహుకాలము తలవాచుకొని యుండ నేరదు. వారిలో దుర్బుద్ధి వెల్లడియైనఁ దత్ఫల మనుభవించి తీరుదురు.

ఉచ్ఛ—సోదరా. ప్రకృతి మీప్రకార మాచరింతము.

సుస్స—మీ యిష్టము.

ఉచ్ఛ—మంత్రీ, ఈ నాటి మాయాజ్ఞల వెంటనే యందఱకును దెలియఁబఱచుఁడు.

[illegible]శస్థ—చిత్తము.

ఉచ్ఛ



## తృతీయరంగము.

---

స్థలము—లోహరరాష్ట్రము.
( తేజుఁడు ప్రవేశించును )

తేజ—(స్వగతము) నాయనంగుఁ జెలికాఁడైన శ్రద్ధాసేనుఁడు నన్ను సుస్సలరాజు దగ్గఱయుండి కార్యమును సాధించుటకై నియోగించెను. ఈ సుస్సలుని తనయన్నయగు నుచ్ఛలరాజుపై ద్వేషమూనునటుల చేయవలయునఁట. ఇది దుస్సాధ్యమైనపని. ఈ సోదరు లేకమనస్కులై యుండనే కారణమున వీరి కన్యోన్య ద్వేషమును గలిగింపవలయును. అయినను సాధ్యమున్నంతవఱకు ప్రయత్నించెదను. (తెఱవంకఁజూచి) సుస్సలరాజు సమీపించుచున్నాఁడు. ఇతనిపై నాయుక్తిప్రయోగ మెంతవఱకు పనిచేయునో చూచెదఁగాక.

( సుస్సలరాజు ప్ర శించును. )

సుస్స—తేజా! మనము నిన్నసాయంతనమేకదా "త్రోషామైదానపు" గనుమనుదాటినది. ఇంతలో నెంతదవ్వువచ్చితిమి? లోకబాంధవుఁడు తమఃపటలినిఁ జోపి ప్రాణికోటిని నిద్రావస్థనుండి మేలుకొలుపకమున్న మన మీ లోహారమును జేరఁగల్గితిమి. అదిగో సూర్యభగవానుఁ డెట్లుపైకి ప్రాకుచున్నాఁడో చూడుము.

గీ. ప్రాగ్దిశ కవాటములఁద్రోసి పఱచుచున్న
చెలి యుషఃకాంత చెంగావిచీరకొంగు
వెంటనంటె భానుండెలవేగ గలిసి
తేజ! భూసుర! సారింపు దృక్కులంమ.

ఉ. కుక్కుటసూత్రధారుఁడును గొక్కొరొకోయని పాడినంతటన్
జక్కనవచ్చె ధాత్రియనుశాల నుషస్సనుకాంత, యప్పుడే

ప్రక్కకుం బోయి నాటిమిరపజ్జ్వలకాంతిపటంబుతోచేం బ్రా
గ్దిక్కను నాట్యరంగమున దీప్తులతో నరుణుండు చెచ్చెరన్.

తేజ—అవును. రాజా! ఈ పర్వతప్రదేశములందు సూర్యుండెంత రమణీయముగాం బ్రకాశించుచున్నాడు? మేము చపాతీలం దిను రాగికంచమువలెనే యున్నాడు.

సుస్స—బ్రాహ్మణో భోజనప్రియః అన్నట్లు నీకును బ్రొద్దుపొడ చినప్పటినుండియే తిండిచింత.

తేజ—మీ కేమి తెలియునయ్యా మాబాధ! సుఖముగాం బల్లకీలో నున్ని కంబళములు గప్పుకొని నిద్రించినవారికి ముదుసలి గుఱ్ఱముపై దూగుచువచ్చిన నాయవస్థ యేమి తెలియును?

సుస్స—తేజా! అది యటుండనిమ్ము. ఈ లోహరాష్ట్రమునలువైపులం బర్వతములచే నావృతమైనదు మన శ్రీనగర పట్టణ శృంగారము నెన్నటికిని మించునది కాదు. ఆ పట్టణరాజంబును నెన్నటికైన మఱవగలమా?

సీ. శ్వేత హిమాంబరావృతమైన శిఖరంబు లంతట కంటికి కాహ్లాద మొసంగ
సుకుమారగాత్రి ప్రసూనముల్ గాలికిం జక్కిలిగింతల పులకింపం
జిరకాలమైత్రితో సెలయేరు లద్దిలో దాగిలిమూతలం దగిలియుండం
బ్రకృతి జన్మస్థలంబు భాంతి నిచ్చుచు వృక్షరాజంబులధికమై రాజిలంగ

గీ. స్వర్గమునువీడి యచటకు జాఱెననంగ
నిర్మల సరోవరంబులు నెగడియుండ
సకలకల్యాణసంపదాస్థానమగుచు
దేజరిల్లును గాశ్మీరరాజధాని.

తేజ—అయ్యా! మీకీ యతిశయోక్తులను మీయాస్థానకవులు నేర్పిరా యేమి?

సుస్స—అయితే శ్రీనగరము నీకెట్లుతోచుచున్నది?

తేజ—సింహశార్దూలాది భయంకర క్రూరజంతువులచే నిండిన యరణ్యములును, గుహలును గల పర్వతములచే నావృతమైన శ్రీనగరము మీకుఁ దప్ప యింకెవ్వరికిని బ్రీతిని జనింపఁ జేయఁజాలదు.

సుస్స—ఓయీ! నీ వెంతటి లౌకికజ్ఞానశూన్యుఁడవు. సింహశార్దూలాదులుండు స్థలములందే శూరాగ్రేసరులుందురు. నీ కటు శాస్త్రమందుగాని ఇటుశస్త్రమందుగాని విద్యయున్నయే కావున నీవు సృష్టిరామణీయతను అభినందింపఁజాలిన వాఁడవు కావు.

తేజ—అభినందింపకేమి? తా మూహించినట్లే శ్రీనగరము సకల సంపత్ స్థానమైన తమయన్నగారు మిమ్మా యటవీప్రదేశమున కేల పంపిరి? అయ్యా! మీరా రాజ్యమును విడిచి వచ్చుట నాకు సమంజసముగాఁ దోఁపదు.

సుస్స—ఓయీ! కాశ్మీరరాజ్యమందీ దక్షిణభాగమున రాజప్రతి ప్రతికూలురైనవా రుండుటచే వారిని నిగ్రహించుటకై మా యన్నగారు నన్నాజ్ఞాపించినందున వచ్చితిని. ఇందు నీ యసమ్మతికిఁ దగిన కారణమేమి కలదు?

తేజ—మీరు సజ్జనస్వభావులగుటచే మీకుఁ బూజ్యస్థానమునందున్నవారు వచించునదంతయు మీరు విశ్వసించెదరు.

సుస్స—తేజా! నీయభిప్రాయమేదో యది నాకు విశదముగాఁ జెప్పుము.

తేజ—అయ్యా! కాలపరిపక్వము కాకున్న హితులవాక్యములు విపరీతముగాఁ బరిగణింపఁబడును. కావున నేనేల యిప్పుడు మీ యభిప్రాయములకు విరుద్ధముగా నాచరింపవలయును.

సుస్స—నీ వేదియో చెప్పఁదలచితివని యనుమానించుచున్నాను. నిర్భయముగా నీ తలంపుల వెల్లడింపుము.

తేజ—మహారాజుగారికి నేను జెప్పునది రుచింపకుండిన?

సుస్స—అభిప్రాయ భేదముండినను సదాలోచనమైన నీకేల భయము. తప్పక నీయభిప్రాయమును నాకెఱిఁగింప వలయును. నీకు నా యాజ్ఞకలదు.

తేజ—నాకెంత యిష్టములేకున్నను మహారాజుగారియాజ్ఞ యనుల్లంఘనీయమైయుంటఁ జెప్పవలసి వచ్చెను. కావున శాంతతతో వినుడు. శరీరమునకుఁ బ్రాణమెట్టులో కాశ్మీరమునకు శ్రీనగరమట్టులే. శ్రీనగరమెవ్వారి వశమందుండునో వారికి కాశ్మీరమంతయు చరణపీఠమైయుండును. అట్టి శ్రీనగరమునుండి తామీదక్షిణమున కంపఁబడితిరి.

సుస్స—అయిన?

తేజ—తామీదేశములో నుండినకాలమందు మీయన్నగారు కాశ్మీర రాజ్యమునుఁ బూర్ణముగాఁ దనవంశమందుంచికొని పిమ్మట మిమ్ము పదచ్యుతునిగాఁ జేయుదురని నమ్ముచున్నాను. లేకున్న మిమ్మింత శీఘ్రముగా నీ నిస్సారప్రదేశము సంకటపుటలో నేమియు నవసరము కనుపింపదు.

సుస్స—చాలుచాలు తేజా! కుజనవిచ్ఛినంచులకా నీవిట్లు ప్రేలుట. నిష్కారణముగాఁ గయ్యములుఁ బన్నఁ బ్రారంభించితివి.

తేజ—రాజా, నాకెంతయిష్టము లేకున్నను నన్ను నిర్బంధించి నాచే మీకప్రియమైన వాక్యములఁ జెప్పించితిరి. అయినను నా యభిప్రాయము దురుద్దేశముతోఁ గూడినది కానందున సే[illegible]ను. సుస్సలమహీపాలా! యింతదూరము మీతో మనవిచేసికొనిన పిమ్మట దాచికొననేల? తామేమైన ననుకొనుడు. నాకు సత్యమనితోఁచిన విషయములు మీతోఁ జెప్పకమానను. నిన్న మొన్న నేకదా మీయగ్రజునికి రాజ్య

ప్రాప్తమైనది. ఇంతలో నేమీకుఁ బ్రతికూలు రీలోహార
యందున్నవారని మీకెవ్వరు చెప్పిరి. ఇదంతయు బూటక
ము. మీ యగ్రజుని మీరు ప్రేమించుట సహజమే కాని స
కలసామ్రాజ్యలక్ష్మీ పరీరంభణ కుతూహలాంతరంగితులై
న రాజులకు నిక్కమైన బంధువులు, మిత్రులు, అనువా
రుందురా?

ఉ. ధారుణిరాజ్యలక్ష్మిని మదంబునఁ జేకొనువారు నిశ్చయం
బారయ బంధులన్ మఱియు నాప్తుల మిత్రుల లెక్కసేతురే.
క్రూరతఁ దండ్రి నే చెఱను ద్రోయఁడె కంసుఁడు రాజ్యకాంక్షియై
దూఱఁడె బాల్యమిత్రుఁడగు ద్రోణుని ద్రుపదుండు మత్తుఁడై.

కావున తాము జాగరూకులై యుండవలయును. నా యు
పదేశములు మీకిప్పుడు రుచింపవని నేను బాగుగా నెఱుఁ
గుదును. కాని యచిరకాలము లోపలనే మీరు యథార్థ
మును గ్రహింపఁ గలుగుదురు.

సున్నల—తేజా! నీవు బ్రాహ్మణుఁడవనియు, నా బాలసఖుండవని
యు, నిష్కపటివనియు, నిన్నింతవఱకు మాట్లాడనిచ్చితి
ని. ఇట్టి ప్రసంగములు నాకు రుచింపవు. పూజ్యులైన నాసో
దరుని చర్యలలో ననుమానాస్పదములైన విషయములు
నాకింతవఱకు గోచరించినవి కావు. కావున నీయుపదేశముల
నింక మానుకొనుము.

తేజ—(స్వ) మనమా! తొందరపడకుము. ఇతఁడింతటితో సా
ధ్యుఁడు కాఁడు. అనుదిన మీతని చిత్తవృత్తి ననుసరించి నా
పూనికను సాధించెదనుగాక! (ప్రకాశముగా) భూపా! మీ
కు నే నత్యంతహితుఁడ నగుటచేతను మీయందు నాకత్యం
త ప్రీతియుండుటచేతను నాకుఁ దోఁచినది దాచక చెప్పితిని.
మీకు రుచింపకుండిన క్షమింపుఁడు. ముందుముందు మీకే య
నుభవమునకు రాకతప్పునా?

సుస్న—మిత్రమా! నీవు కేవలము ఛాందసుఁడవు. నీవు లౌకికుఁడవు కావని యిదివరకే చెప్పియుంటినిగదా? నీవు లోకసామాన్య దృష్టికిఁగనఁబడు విషయములనే నమ్మెదవు.

తేజ—అటులే యుండనోపు. నిశ్చయముగా నాదే పొరపాటని తోఁచెడి. ఇకముం దిట్టి ప్రసంగములు చేయవలసిన బలవత్తరములైన యాధారము లుండిననే నివేదించికొందును.

(ప్రవేశము:— చమూపతి కొందరుభటులు)

చమూ—జయము. జయము. మహారాజ

(అందరును నమస్కరించి)

చమూ—స్వామీ! తమయాజ్ఞానుసారము సర్వము సిద్ధము చేయఁ బడినది. రాజమందిరము, అస్థానమంటపము మున్నగు రాజనివాస యోగ్యస్థలములన్నియు, నలంకరింపఁబడినవి. తమ రాకకై ప్రజలందఱును నెదురుచూచుచున్నారు.

సుస్నల—తేజా, ఇంకజాగేల. రమ్ము. రాజమందిరమును బ్రవేశించెదము.

తేజ—ఏలికయొక్క చిత్తవృత్తి ననుసరించుటయే ముఖ్యకర్తవ్యము. తాము సెలవిచ్చినటులే కానిండు.

(నిష్క్రమింతురు)



## చతుర్థరంగము.

——

స్థలము:—శ్రీనగరము.
(ఉచ్ఛలరాజు - భోగసేనుఁడు.)

ఉచ్ఛ—భోగసేనా, నీవు దెల్పిన యీ వర్తకధనికుల వివాదము చిత్రముగా నున్నది. నేను మరల సావధానముగా మొదటినుండి తుదివఱకు వినవలయును.

భోగ—మహారాజ. వారిద్దఱు ద్వారముకడ వేచియున్నారు. సెలవయ్యేనేని లోపలికి రప్పింతును.

ఉచ్ఛ—న్యాయాధిప, అటులే కానిమ్ము. వారిని రప్పింపుము.

భోగ—ఓరీ సేవకా!

సేవ—స్వామీ! ఏమియాజ్ఞ.

భోగ—ద్వారము వెలుపట నుండు వారిని లోపల బ్రవేశపెట్టుము.

సేవ— చిత్తము. (నిష్క్రమించును.)

ఉచ్ఛ—ఇందునీ యభిప్రాయమేమి.

భోగ—సూక్ష్మముగాఁ బరికించిన వర్తకుఁడే మోసగాఁడని విశదమగును.

(ప్రవేశము:—ఖాతాపుస్తకములతో వర్తకుఁడు- ధనికుఁడు.)

భోగ— ఈతఁడే ధనికుఁడు, ఈ వర్తకుని దగ్గఱ రక్షణార్థమై లక్ష దీనారములు ౨౦ సంవత్సరములక్రిందట నుంచెనఁట.

ఉచ్ఛ— అవునా? వర్తకా ఇదినిజమా?

వర్త—[ చేతులుజోడించి ] దేవరవారు న్యాయాన్యాయముల నఁగమనించి బీదల నేలవలెను.

ఉచ్ఛ—ఓరీ! నేనడుగుప్రశ్నకు ముందు ప్రత్యుత్తరమిమ్ము. లక్షదీనారములు నీదగ్గర నుంచినది నీవొప్పుకొందువా లేదా?

వర్త—అట్లే యనుకొన్నాఁడు.

ఉచ్ఛ—(ధనికునితో) ఆ మొత్తమునుండి నీవెంత వాడుకొంటివి.

ధని— స్వామీ నే నప్పుడప్పు డితని దగ్గఱ తీసికొనినమొత్తము ౨౦ వేల దీనారములే.

ఉచ్ఛ—ఇదియు నిజమా వర్తకా?

వర్త—అయ్యా, ఇక్కడనే మా కిద్దఱకుఁ గల్గిన మెచ్చు తగ్గులు ఈతనికి నే నొక టంకమైన బాకీలేను.

ఉచ్ఛ—మంచిది. మీ లెక్కలఁ జూపుఁడు. పరీక్షించెదముగాక.

[ వర్తక ధనికులు తమ తమ భూర్జ పత్రముల కట్టల విప్పుదురు. ]

ఉచ్ఛ—భోగసేనా, వైశ్యులెప్పుడును విశ్వాసఘాతుకులను సంగతి యబద్ధముకాదు సుమా. నదులు సముద్రమున కుదకంబు నిచ్చిన మరల మేఘరూపమున నా సంద్రము నదుల బూరించును. ఈ వైశ్యుల దగ్గఱ ఉంచిన ధనము కాసైన ను దిరిగిరాదు.

మ॥ అలికాదర్శంబగు నాననంబుపయి రక్తాభల నేత్రంబులు।
ధృత ఘోషంబును నొప్ప వ్యాఘ్రములు ఘాతధ్వంసముం జేయుని।
క్షితి వైశ్యుల్ కడునొద్దికన్ నగుచు యుక్తింద్రాలరీతిన్ ముఖం।
బతికాంతంబుగ మార్దవస్వనముతో నార్జింతు రాజాయముల్॥

కావున వీరి నెన్నటికిని నమ్మరాదు.

వర్త—దేవరవారు చిత్తగించఁగలరు.

జమా ఖర్చుల పట్టీ వివరము

లౌకిక శకము ౪౧౬౧ వ సం॥ ర చైత్రి శు॥ ౧ మూల గ్రహణము: ౧ లక్ష దీనారములు ఈ ధనికునిపేర జమా. అందుకుగాను అప్పు డప్పు డితడు వాడుకొనిన పద్దుల వివర మేమనగా,

| | |
|---|---|
| ౬౦౦ దీనారములు. | మెట్టు సుంకమున కిచ్చినది. |
| ౧౦౦ ,, | ప్రాత చెప్పులు కుట్టినందులకు. ఒక చబుకు చేయించినందుల కిచ్చిన మొత్తము. |
| ౫౦ ,, | ధనికుని బానిస కాళ్ళమీద గంజిపడి బొబ్బలు పోయినప్పుడు పట్టించినప్పటి నెయ్యి ఖర్చు. |
| ౩౦౦ ,, | కుండ లన్నియుఁ బగిలిపోగా కుమ్మరి దాని యాక్రందనము చూడలేక జయ దలఁచి దాని కిప్పించిన మొత్తము. |

చూడవయ్యా, ధనికుఁడా! ఈ పత్రములో నన్నింటిని విశదముగా నెక్కించి యున్నాను. లౌకికశకము ౪౧౬౩ వ సం॥ రం. చైత్ర మాస ప్రారంభమునుండి ౪౧౬౪ వ సంవత్సరాది వఱకు తీసికొనిన మొత్తము.

| | |
|---|---|
| ౧౦౦ దీనారములు | పిల్లికూనలకు చేపలను, ఎలుకలను గొనుటకై తీసుకొన్నది. |
| ౨౦౦ ,, | శ్రావణపక్ష స్నానమందు ఘృత మాక్షికములకై తీసికొనినది. |
| ౧౦౦ ,, | నీ కొడుకు దగ్గుచుండినపుడు తేనె బెల్లము మా దుకాణములో కొనినందు కయిన ఖర్చు. |

చూడవయ్యా, లెక్కచూస్తే తిక్క వదలును. ఈ లెక్క అబద్ధమని యెవ్వరైన అందురా మఱి. ఇదిగో నింకా విను.

ఉచ్ఛ—ఏమీ. చిత్రముగా నున్నది ఈ లెక్క. ఇంక యెంత కలదు.

వర్త—ఇదిగో మీరేనాడండి స్వామీ. [ చేతి కందిచ్చును ]

( ఉచ్ఛలుండు ఎగదిగ చూచుచుండును. )

వర్త—ఏమో. ఈ వ్యాపారమంతా యింతే. లోకులకు సహాయము చేసినా మామైననే నింద చేయకపోయినా నిందే. పైసా పైసా కూడబెట్టి యింతగంటు చేసీ చేయకమునుపే మా వంటివాడిమీద నిందలు మోపుదురు.

భోగ—( ధనికునితో అపవారితముగ ) ధనికా, ఒకమాట. ఈ వర్తకుని యథార్థమును గుర్తించెదను. నీవుమాత్ర మిట్లు సేయుము. అతఁడు చెప్పదు మొత్తము తప్పనియు నంతకన్న నెక్కుడే తీసికొంటి ననియు నీవు చెప్పుచుండుము. గ్రహించితివా?

ధని—చిత్తము. అటులే చేయుదును.

ఉచ్ఛ—(వర్తకునితో) కానిమ్ము. త్వరగా ముగింపుము.

వర్త—లౌకిక శకము ౪౧౬౭వ సం॥ ర శ్రావణమాస శుద్ధ షష్ఠీ నుండి లెక్క.

౩౦౦ దీనారములు కత్తులు మ్రింగుచు పొట్టపై బండలు బెట్టుకొనిన మొండి బిచ్చగాని కిప్పించితిమి. ఏమయ్యా, సరేనా?

ధని—ఆగుము ఆగుము. ఈ మొత్తము సరిగా లేదు.

వర్త—ఆఁ ఏమి? మరల పల్కుము.

ధని—ఆ మొత్తము ౩౦౦ గాదు. ౬౦౦ దీనారములు. నాకు జ్ఞాపక మున్నది. ఎవరైతే నేమి. ఉన్నంత చెపవలయును.

వర్త—అట్లనా చూడండి స్వామి. నే నే తక్కువ వ్రాసియున్నాను (సవరించుకొని) తర్వాత.

౨౦౦ దీనారములు. ధూపానికి మీా పుత్రులకు నీరుల్లి, చెట్లవేర్లు ఇప్పించినందుకు. ఈ మొత్తము కూడ లెక్క కెక్కినది.

ధని—ఉండవయ్యా. ఇదియు దప్పే. ౨౦౦ కాదది ౫౦౦ ఉండవలసినది.

వర్త—ఆఁ సరే. ఉండవచ్చును. మా పిల్లవాని వ్రాత యిది. నేను లేని కాలములో తప్పులు వ్రాసినాఁడు. ఈ పిల్ల కాయల నమ్మితే యింతే కదా. కొంపలు పాడుకావల సినదే. అయ్యా ధనికుఁడా, నీ వెంత ధర్మాత్ముఁడ వయ్యా, ఈ కాలములో మిగిలినంత మిగిలెననువారే కాని తమకు నష్టమైన నొప్పుకొనువా రెవరు? తర్వాత, లౌకిక శకము ౪౧౬౬ వ సం॥ భాద్రపద మాసమునుండి లెక్క.

౧౦౦౦ దీనారములు. జూదమాడుటకై తీసుకొన్నది.

ధని—ఏమయ్యా, ఇది శుద్ధాబద్ధమే నాకు జూదమాడు సలవాటే లేదు కదా.

ఉచ్ఛృ—చాలు ఇంకచాలు నీ గణన.

వర్త—మహారాజ, ఇంక కొంచెము ౬౦ పద్దులు మాత్రమే యున్నవి. చిత్తగించవలెను.

లౌకిక శకము:.......... .........

ఉచ్ఛృ – చాలు నీ లౌకికమంతయుఁ దెలిసెను. నీ యుదంతమును గుర్తించితిమి. ఏదీ లెక్క నిట్లు తెమ్ము. (తీసికొని) ఈ కడపటిపద్దు నీ పిల్లవానివ్రాత యంటివే. పై వ్రాతకును దీనికిని భేద మేమియు లేదే.

వర్త—అయ్యా, వాఁడు నేను వ్రాసినట్లే బహు చిత్రముగా వ్రాయును.

ఉచ్ఛ—పోనిమ్ము. ఈ ధనికుఁడు మొదట నీ దగ్గఱ దాచి యుంచిన మూలగ్రహణమం దేమైన దీనారములు మిగిలి యున్నవా?

వర్త—ఏవో కొన్నిమాత్ర మున్నవండీ. ఆ మొత్తము గూడ మీ యెదుటనే చెల్లించి యీ పీడనుండి విముక్తుఁడ నయ్యెదను. ( అని సంచీ చూపును )

ఉచ్ఛ—ఏదీ దీనారములు కొన్ని చూపింపుము.

[ వర్తకుఁడు సంచి విప్పి కొన్నిఁటి నిచ్చును]

ఉచ్ఛ—[విమర్శించి చూచి నవ్వుచు.]

ఎంత యుక్తి చేసినను దొంగతనము దాగునా?
ఏమీ న్యాయాధిప. మాపూర్వులైన రాజులకు జ్యోతిష మందును దివ్యజ్ఞాన మందును సంపూర్ణ సామర్థ్య ముండెనా యేమి?

భోగ—ఏలిన వారు చాల చిత్రముగా సెలవిచ్చుచున్నారు. విశదముగా వినఁగోరుచున్నాను.

ఉచ్ఛ—ఈ ధనికుఁడు కలశ మహారాజు కాలములో కదా వర్తకుని దగ్గఱ నిక్షేప ముంచినది.

భోగ.—చిత్తము

ఉచ్ఛ—అట్లైన ఆ దీనారము లన్నియు కలశ మహారాజుగారి రూప ముద్రలతోఁ గూడియుండవలయును.

భోగ— సత్యము.

ఉచ్ఛృ—అటుగాక ఈ నాణెము లన్నియు మా ముద్రలుగల దీనారమ్ములై యున్నవి. ఆహా! అంతయుఁ దెలిసెను. ఈ సజ్జన వేషధారియగు వర్తకుఁడు అమాయకుఁడైన యీ ధనికుని బూర్తిగా మోసగించినాఁడు. కావున ధనికుని వాక్కులనే నమ్మెద. వర్తకా!

వర్త—(నమ్రుఁడై) స్వామీ!

ఉచ్ఛృ—ఈతఁడు ౨౦ వేలు నీ దగ్గఱ తీసికొనినటుల చెప్పుచున్నాఁడు. అయ్యవి పోఁగా మిగత ౮౦ వేల దీనారములను నీ వీయ వలసి వచ్చును.

వర్త— ఈ లెక్కంతయు నబద్ధమా స్వామీ.

భోగ—అవును. అంతయు నబద్ధమే. ఈ ధనికుఁడు పరీక్షార్థమై నీవు చెప్పు మొత్తములు తప్పనియు నంతకన్న నెక్కుడే యుండవలయుననియుఁ జెప్పినపుడు దుర్లాభేచ్ఛచే నవి నిజమంటివి.

ధనీ— మఱియు నీతఁడు ప్రపంచములో నెవ్వరును కని వినసట్టి ప్రాతలు వ్రాసినాఁడు. నా కొడుకు దగ్గుచే బాధపడగా తేనెయు బెల్లమును గొనెనఁట. చెట్టిగారు మంచి మంచి మందులే యిచ్చినారు.

వర్త— మహాప్రభో, నే నీతని ద్రవ్యము నుంచికొని కాపాడినందులకైన నేమైన నిప్పింపరా?

ధని— ఓయీ, ఎట్లు కాపాడితివో చూపుము. నీవు దురుద్దేశముతో నీతని నష్టపఱుప యత్నించినందులకు నీవు ౨౦ వేల దీనారములు ఈ ధనికునికెక్కుడుగా నీయవలయును,

వర్త— అబ్బో! చచ్చితి, చచ్చితి. వ్యర్థముగా నాశనమయితిని. మహాప్రభో ఈ ౨౦ ఏండ్లుగా కడుపుగట్టి కూడఁబెట్టిన దంతయు మందినోట గొట్టించిన నేనింక బ్రదుకఁజాలను.

ధని — మహారాజుగా రవ్యధా భావింపకుండిన నా దొక మనవి కలదు.

ఉచ్ఛ—ఏమది. తెలుపుము.

ధని — ఈ వర్తకుని కిచ్చిన శిక్షను మన్నింపవలయును. నాకు రావలసిన మొత్తము మాత్రము వచ్చిన చాలును.

ఉచ్ఛ—వర్తకా, ఈ ధనికుని యౌదార్యము వలన నీవు క్షమింపఁ బడితివి. ధనికుని ౧౦ వేల దీనారముల మాత్రమే చెల్లించుము.

వర్త — స్వామీ నేను ౧౦ వేల దీనారములఁ జెల్లింపఁజాలను. కరుణింపవలయును.

ఉచ్ఛ—ఏమాత్రము గరుణింప జాలము. నేటినుండి యొక మాసములోపల నీవు చెల్లింపకుండినఁ జాల కఠిన శిక్షకుఁ బాలగుదువు. సేవకా,
ఈతనిని ద్వారము వెలుపట తీసికొనిపొమ్ము.
ధనికా, నీవును వెడలి పొమ్ము. వర్తకుఁడు గడువులోపల నీ సొమ్మీయకుండిన మాకుఁ దెల్పుము.

ధని — దేవరవారి యనుగ్రహము.

[వర్తక ధనికులు నిష్క్రమింతురు]

భోగ—సెలవగునేని మహీవల్లభునితో నొకవిషయమై నివేదించి కొనఁ దలఁచి యున్నాఁడను.

ఉచ్ఛ—ఇట్టివే యింకేమైన చిక్కువాదము లున్నవా?

భోగ—చిక్కేమియు లేదు కాని తమ యనుగ్రహము వడసి యధికార పదవియం దున్నవారే శిక్షార్హులగుటచేఁ దమ కీ సంగతి తెలుపవలసి వచ్చినది.

ఉచ్ఛ—అధికారియైన నపరాధి యైనప్పుడు న్యాయ మార్గము నెట్లు విడనాఁడ నగును.

భోగ— కలఁడు కదా మీ కోశాధ్యక్షుఁడైన శ్రద్ధాసేనుఁడు.

ఉచ్ఛ—అవును. అతని విషయమేమి? సవిస్తరముగాఁ దెలుపుము.

భోగ — శ్రద్ధాసేనుని బంధుజాలములో "సడ్డుడు" అనువాఁడొకఁడు కలడు. ఆ సడ్డుని తల్లితో "మయ్యామట్టుఁడు" అనువాఁడు వ్యభిచరించెనఁట. అందులకు సడ్డ ప్రేరితుఁడై శ్రద్ధాసేనుఁడు తన యధికార బలముచే మయ్యామట్టుని కండ్లు బొడిపించినాఁడు.

ఉచ్ఛ—ఏమీ! యింతటి ధూర్తత్వమా? వీరి కింతటి స్వాతంత్ర్యమా? భోగసేనా? విషయ మెట్లుండినను శ్రద్ధాసేనుఁడు న్యాయ విరుద్ధమైన కార్య మొనరించినాఁడు,

భోగ—అతఁడు పార్థివేంద్రుని ధనాగారాధ్యక్షుఁడగుటచే నేనేమియుఁ జేయఁజాల కున్నాడను

ఉచ్ఛ—ప్రకృతము శ్రద్ధాసేనుని ఆపదవి నుండి తొలఁగించుచున్నాము. తర్వాత సర్వమగు శిక్షను విధింతుము. భోగసేనా! శ్రద్ధాసేనుని తనపదవినుండి నేటినుండి తొలఁగించితిమని మంత్రియగు ప్రశస్తకలశునితోఁ జెప్పి యాజ్ఞాపత్రిక పంపుమనుము.

భోగ— చిత్తము, ఇప్పుడే నివేదించెదను.

ఉచ్ఛ—ఓయీ! ఒకవిషయమును గురించి నాకుఁ జాలపరితాపము కలుగు చున్నది.

భోగ— అదేదియో వినవచ్చునా?

ఉచ్ఛ—హర్షుని కాలమున దౌష్ట్యములు సల్పుచు దేశమును ప్రజలను నాశనము చేయుచుండిన కాయస్థులు (ఉద్యోగులు) ఈ రాజ్యమున నింకనుఁ బ్రబలియున్నారు.

క॥ అరయ నధికారు లెందును
బరికించిన దుష్టులగుచుఁ బరవిత్తములన్
హరియించుచు నిలుపేదలఁ
బరితాపము నొందఁ జేసి బ్రదుకుదు రిచటన్.

మఱియు

తే॥ గీ॥ ఎండ్రి జన్మించి నంతనే తండ్రిఁ జంపు
పుత్త్రికయుఁ జంపుఁ దనతల్లిఁ బుట్టినంత
లంచగొండి, కృతఘ్నుఁడు, లాపటుండు
నయిన యుద్యోగి సర్వుల లయమొనర్చు.

నరాధిపతియని పేరుపెట్టి కొనినవాఁడీ బీదసాదల వీరి నుండి రక్షింపకుండినవాఁ డుండిననేమి? లేకుండిననేమి? ప్రకృతము చెప్పఁబోయిన దేమన భూతభిక్షుఁడను నుద్యోగి లంచము లీయని బీదల నిక్కట్టముగఁ బీడించువాఁడు. ఈ సంగతి నెఱిఁగి వానిని వికృతవేషునిగఁ జేసి వీధులందుఁ ద్రిప్పుమని చారులఁ గొందఱ నియోగించితిని. వా రింతలోఁ రాగలరు.

( చారుఁడొకఁడు ప్రవేశించును )

చారు—స్వామీ! మీయాజ్ఞప్రకారము భూతభిక్షుని నగరమందుఁ ద్రిప్పివచ్చితిమి.

ఉచ్ఛ—వానినిటు పిలిచికొనిరమ్ము.

చారు—చిత్తము.

(నిష్క్రమించును.)

భోగ—ఉచ్ఛలమహీపాలా! మీరు విధించిన యీ శిక్ష చాల కఠినమైనది. ఉద్యోగులకు మానహానికన్నఁ బ్రాణహాని మేలు.

ఉచ్ఛ—భోగసేనా! వీని పరాభవమును గమనించినవారై నారాజ్యములో నేయుద్యోగియు నింకెన్నటికిని బ్రజాపీడకుఁడుగా నుండకుండుటకై యిట్లుచేయించితిని.

(ప్రవేశము:-భూతభిక్షుఁడు, ముడివేయబడిన గడ్డముతో బల్లెము చేతఁబట్టి, పాదములందలి సంకెలల శబ్దముతో ఇద్దఱుచారులును.)

భూత—(నమస్కరించి) దేవా! నన్నిట్లవమానించుటవలన మీకేమిలాభము. ఇంకే కఠినదండనమైన విధించియుండిన నే నోర్చియుందును. కాని నేనిప్పుడతినీచజనుల దృష్టిలో సహితము పలుచనై పోయితిని?

ఉచ్ఛ—ఓయీ! సజ్జనులను బీడించుటనీమతమా? జనులు నీచే బాధపడువేళ వారుమాత్రము తమగౌరవము గోలుపోయి యుండలేదా. గౌరవమెవ్వరికిఁ బ్రియముకాదు.

భూత—స్వామీ! మీకునే నెదురాడ వెఱతును. మీభృత్యుల మగుమమ్ము మీరిచ్ఛవచ్చినట్లు శిక్షింపనర్హులు.

భోగ—దేవా! ఇతనికిఁ జాలినంతకన్న నెక్కుడు శిక్షయైనది. కావునఁ గరుణాయుతులై యితని మన్నించి యథాస్థానమున నుద్యోగముచేయు ననుజ్ఞయిత్తురని ప్రార్థించుచున్నాను.

ఉచ్ఛ—మంచిది. భూతభిక్షూ! నీవింకెన్నటికిని నిట్లుచేయకుము. నిన్ను క్షమించితిని. యథాప్రకారము నీయధికారమందుండుము. పొమ్ము. (భూతభిక్షుఁడు నిష్క్రమించును.) చారా! నగరవిశేషములింకేమైనను గలవా?

చారు—భూవరా! మీరీమధ్య దుష్టుల శిక్షించుటచే వీథులందెం దుఁజూచినను భిక్షుకులు బిచ్చమెత్తుచు మిమ్ముఁ గీర్తించు చుండుట చూచితిమి. కొందఱిట్లు పాడుచుండిరి.

అశ్వగతి.

ఈ వసుధాధిపుఁ బోలిన యేలికలుండరుగా,
బావనుఁడై కడు బీదల ప్రాపుననుండెడుగా!
భూవలయంబున నీతని భూరియశంబలరెఁ
గావుత నీతనిదైవము కామములిచ్చికృపన్.

ఇవ్విధంబున స్తోత్రములనేకములవింటిమి స్వామీ!

ఉచ్ఛ—అది యటుండనిమ్ము. వేరుసంగతు లేమయిననుండినఁ దెలుపుము.

చారు—ముఖ్యమగుసంగతులేమియు లేవు గాని యొకటిమాత్ర ము ప్రజలు విశేషముగా ననుకొనుట వినినారము. అదే మన ఏలినవారి పరిపాలననాటినుండియు ప్రభుత్వోద్యో గులు లంచములుదినుటగాని, బీదల భూగృహముల నధి కారబలముచే నపహరించుటగాని మానినారని ప్రజలు పరమసంతోషముతోనున్నారు.

ఉచ్ఛ—మంచిది. మీరిపుడుపొండు. అవసర ముండినప్పుడు మరలపిలిపించెదను.

చారు—చిత్తము. (నమస్కరించి నిష్క్రమింతురు.)

ఉచ్ఛ—భోగసేనా! పొద్దువాలమైనది. వెడలుదమురమ్ము.

(నిష్క్రమింతురు.)





# ఉచ్ఛలవిషాదము.



## ద్వితీయాంకము

---

### ప్రథమరంగము.

---

(స్థలము:—శ్రీనగరములో స్వయంభూ దేవాలయము.)

ప్రవేశము:—శ్రద్ధాసేనుఁడు.

శ్రద్ధా—(స్వగతము)

ఉ. కాలము మాఱె నుచ్ఛలుని కాంక్షలు మీఱె దురంత బాధచేఁ
జాలకృశింపఁజొచ్చెను ప్రజానివహంబు తెఱంగికేది యే
లీలను సైంచునిట్టి విపరీతములుండునె నేడు హర్షభూ
పాలుని గోలుపోయి యలప్రాకృతునిం గొలువంగవచ్చెగా.

ఈ యుచ్ఛలుఁడు నిరంకుశాధిపత్యమును వహించి ప్రజాపీడన గావింపఁ దొడగెను. ఆత్మసంరక్షణమునకును, శౌర్యమునకును, గౌరవమునకును నాధారమైన శస్త్రసమితిని డామరులు ధరింపఁగూడదనియు, వారు గుఱ్ఱములపై స్వారిచేయఁగూడదనియు నితఁడు చిత్రవిచిత్రశాసనములఁ జేసినాఁడు. జనులు సభలనుగూడ చేయఁగూడదట. ఎందైన నలుగురు మాట్లాడికొనినచో వెంటనే చారుడెవ్వడైన వారిమాటలపొంచి వినుచుండును. భావముల నరికట్టిన మూర్ఖుడితఁడుతప్ప పూర్వమెందైన నెవ్వడైననుండెనా!

మున్నెరాజులిట్లు చేయఁజూడలేదు. వినలేదు. మఱియుద్వంద్వ యుద్ధములందీతని కధికాసక్తి. భూతదయ యించుకైననువలదా? ఖడ్గములొండొంటి నొఱసిమెఱసి శరీరములఁజీల్చిన నీతనియంగ ములకేమైన నొప్పియుండునా? ఈక్రూరసర్పమిప్పుడే జనులను గా ఱియపట్టుచుండ విషకోశములు వృద్ధియైనపిమ్మట కాట్లచే నెంద అను నాశనముచేయునో యెవరికెఱుక ఎంతత్వరగా వీని దురహం కారఫణమును నడఁగఁద్రొక్కిన లోకమునకంత క్షేమము...

నా ప్రియస్నేహితుఁడగు తేజుఁడు లోహారమునుండి నేడేకదా వచ్చునట్లుజాబువ్రాసియుండెను. ఆజాబులో "నీకు నేను స్వయ ముగా సంతోషవార్తను వినపింతును" అని మాత్రము సూచిం చియుండెను. ఈ సువార్త యేమైయుండునోకదా? సుస్నలునికిని సుచ్ఛలునికిని ద్వేషముకలిగియుండునా? ఏలతొండఱ? అతఁడు వచ్చినవెంటనే చూడాసేననితో వతనినిచ్చుటకిఁ బిలిచికొనిర మ్మని చెప్పియుంటినికదా వారువచ్చినపిమ్మట సర్వమును విశద మగును......అంధకారము బంధురంబై కకుబంతరంబుల గప్పి కొనుచున్నది—ఏలయో నాస్నేహితులింకను వచ్చినవారుకారు.

ఉ. చీకటిపర్వ నల్దిశల శీతలవాయువు వ్యాప్తినొందె భ
ల్లూకము రీతి యామవతి లోకులకెల్లను భీతిఁగొల్పి తా
నేకడఁజూచినన్ మసలు; నేకటమై యిల జంబుకంబులున్
ఘూకములున్ నిశీథమును గూర్చిన స్తోత్రము సేయుచుండెడిన్,

ఇట్టిసమయము కదా మాయుద్యమమునకుఁ దోడుపడునట్టిది. యా మవతీదేవీ! నక్షత్ర కిరీటాలంకృతమైనరాణీ! నిన్నెంతని సంస్తు తింతు. ఈనిశీథంబున

సీ. మధుపాన మత్తులై మాటికి ముంతలఁ
గ్రోల్చుచు వింతగాఁ గ్రేలువారు
జీవనమెంతయో చేదుగాఁ గనబడి
నాత్మహత్యకు సిద్ధమైనవారు

ధనికగృహంబుల ద్వారంబులను జీల్చి
    తమకందినట్టివి తడవువారు
తన్వితీరెడుదీఁ దన్వులతోఁగూడి
    సుఖసాగరంబునఁ జొక్కువారు
గీ. జనుల హితమునుగోరు విచారమతులు
పీడితాళినిరక్షించు విమలమతులు
స్వీయకర్మల మగ్నులై చిక్కియుండ
మితము మీరుచు నిద్రింతు రితరజనులు.

(లోపల ధ్వని విని) ఎవ్వరో యీ దిక్కున వచ్చుచున్న ట్లు తోచుచున్నది.......ఎవ్వరక్కడ?

చూడ—శ్రద్ధాసేనుని మిత్రులు.

శ్రద్ధా—చూడాసేనుని ధ్వని! ఏమోయి యింత యాలస్యము. మన తేజుఁడు వచ్చినాఁడా?

చూడ—మన ముఖ్య కార్యసాధకుఁడైన యీ తేజుని వెంబడించి కొనివచ్చుటలో నాలస్యమైనది.

శ్రద్ధా—తేజా! నీకు నమస్కారములు. నీ పునస్సందర్శనము వలన నా కత్యంతానందము కలిగినది. మనము తలపెట్టిన యుద్యమ మందు నీ కెంత జయము కలిగినదో వినుటకు నా కాతురత మెండగు చున్నది. నీ ప్రయత్నములందు జయమే కలిగియుండిన నా సంతోషమునకు మేరయే యుండదు. ఏదీ నీ వృత్తాంత మంతయు సూక్ష్మముగా వెల్లడింపుమా?

తేజు—శ్రద్ధాసేనుని వంటి నీతి విద్యా విశారదుఁడు కార్యమును నడపుచుండ నా ప్రయత్నములకు విఘ్నము లేల కలుగును?

చూడ—మిత్రమా! జాగేలచేసెదవు. త్వరగాఁ దెలుపరాదా?

తేజ—అట్లైన వినుఁడు. సున్నలరాజునకుఁ బ్రథమమునఁ దప యన్నయగు నుచ్ఛలరాజుపై గాఢమగు భక్తియుండెను.

కాని దిన దిన మాతని మనస్సున కెక్కునట్లుగాఁ దన యన్నపై నేరారోపణము చేయుచు వచ్చితిని. నేను బన్నిన యుక్తులన్నియు నిప్పుడు మీకుఁ జెప్ప నవసరములేదు. నా పరిశ్రమముయొక్క ఫలిత మేమనగా సుస్సలుఁడు తుదకు తన యన్న యందలి విశ్వాసమును వదలుకొనెను. అంతటితో దృష్టినొందక యొక గొప్ప సైన్యమును సిద్ధముచేసి యింతలో నుచ్ఛలరాజుపై దాడి వెడలనున్నవాఁడు. నా కిచ్చట చాల యవసర కార్యములుండెనని సుస్సలునితో సెలవు తీసికొని వచ్చితిని.

శ్రద్ధా—సెబాస్. తేజా. నీ చాతురీ మహిమకు చాల మెచ్చితిని. నీ యీ సహాయము వలన మన యుద్యమమునకు జయమే యని నా యంతరాత్మ చెప్పుచున్నది. ఇక్కడి విశేషములు నీ కేమైనఁ దెలియునా?

తేజ—ఇప్పు డిప్పుడే కొన్ని చూడా సేనుని వలన వింటిని

శ్రద్ధా—రాజు దిన దినము జనులచే ద్వంద్వ యుద్ధములు చేయించుచు లోకుల బాధించుచున్నారు. ఇంతియకాక అనేకోద్యోగుల నిష్కారణముగాఁ దమ పదవులనుండి వెడలఁ గొట్టుచున్నాడు. కొంతకాలము క్రిందట నన్నును కోశాధిపత్యమునుండి తొలగించి యున్నారు.

తేజ—ఈ రాజసేవ చేయుటకన్న నూరకుండుటే మేలు.

చూడ—ఉద్యోగులన్న జ్ఞాపకము వచ్చెను. పాపమా భూతభిక్షుని సంకెలలతో నూరేగించినప్పటి నుండియు నుద్యోగు లందరును భయ భ్రాంతులై యున్నారు.

శ్రద్ధా—అతఁడొకఁడే యననేల మొన్ననే లలితాంగునిపై భోగపుసానుల యిండ్లకు తెడు పోవుచున్నాడని కోపించి యతనిని వేశ్యలతోఁ గూడ నాట్యమాడించి హాస్యాస్పదునిగాఁ జేసెను. ఇట్లందరనో కష్టపెట్టుచుండ మన్నము స్థాన

ము ధరించి యుండుట పాడియా తేజా! నీ బంధువగు తిల
కుని వృత్తాంత మేమైనఁ దెలసెనా?

**తేజ**—ఇంకెక్కడి వృత్తాంతమయ్యా! ఈ రాజ శాసనము నుల్లం
ఘింప నెట్టి బలశాలురకైనను శక్యమా? శ్రద్ధాసేనా,
బుద్ధి కౌశలమున నీ వసామాన్యుడవు. మన మీ రాజును
రూపు మాపుటకై యేమేమి యాలోచనలు చేసితివి.

**శ్రద్ధ**—నే నతని వీరులను మన యుద్యమములలోఁ జేర్చి యు
న్నాడను. మన బలములన్నియుఁ గూడిన పిమ్మట నా
కార్య మెంతటిది.

**భూడా**—ఇప్పు డెందరు మనకు సాయపడుదురు.

**శ్రద్ధా**—నా సోదరుడగు ప్రయాగుఁడు నావెంట నంటియుండును
రాజ ఖడ్గధారియగు సుజనాకరుఁడు మన పక్షముననే
యున్నాడు. వృద్ధుఁడు, హంసరథుఁడు, భూతభిక్షుడు
మున్నగువా రనేకులు మనకుఁ దోడైయున్నారు. కాని
మన కెందరు సహాయము చేసినను భోగసేనుడు మాత్రము
మనకుఁ బ్రతికూలుఁడైన కార్యసాధన చాల కష్టమగును.

గీ. వాసుదేవుని సాహాయ్య బలముచేతఁ
పాండవేయులు దౌష్ట్యంబు బాపి నటుల
భోగసేనుని మన దీక్షఁ బూనఁ జేసి
యుచ్ఛ్రల ధ్వంస మొనరించు టురవు సుమ్మ.

భోగసేననియందు దాసరులకు విశ్వాసమునెంతు ఉచ్ఛ్ర
లుఁడీ దాసులను నిరాయుధులనుగాఁ జేసినందులకు
వీరికి రాజుపై ప్రీతితగ్గినది. ఇట్టిసమయములో మనపక్ష
మునకు భోగసేనుని ద్రిప్పినట్లైన నతని పేరుతో మనకుం
తమైనను సాధింపవచ్చును. జనులందఱును ఆర్తినొందినట్లు
భోగసేనుని కనేకలేఖలు వ్రాయించి యితనియింటిలో
ఫల వేయించినాఁడను. ఇంతియుకాదు. ఇతనికిని నుచ్ఛ్రలు

నికిని ద్వేషము కలుగునట్లుగా భోగసేనునిపై నిందలు మోపినట్టి జాబులు రాజుగారి కంపియున్నారు. ఇంతలో సుస్సలునికిని, ఉచ్ఛలునికిని యుద్ధము జరుగును గదా. దానికిని గారకుఁడు భోగసేనుఁడే యని రాజునకు బోధ పడునట్లు చేసెదను. ఈ తంత్రముచే వారిరువు రన్యోన్య ప్రతికూలు రగుదురు. ఇంతవరకు నేను బన్నిన యుక్తు లెంత మాత్రము పనిచేసినవో రేపుసాయంతనము భోగ సేనునితోఁ గలిసి కనుఁగొనెదను.

తేజ—శ్రద్ధాసేనా! ఏమి నీ చాతురీమహిమ! ఓయీ. భోగసే ననితో మాట్లాడునప్పుడుచాల జాగ్రత్తతో మెలఁగ వల యును సుమా.

శ్రద్ధా—సుహృద్రత్నములారా, అంతమాత్రము నాకుఁ దెలి యదా? మీరును మెలకువతో నుండవలయును. ఈ రహ స్యమును హాస్యమునకైన నెవ్వరితోడను బ్రసంగింపఁ గూడదు సుమా

తేజ }
చూడా } —అట్లే చేయుదుము.

శ్రద్ధా—మనము ముందు వారమునాడు రాత్రి కాలమం దిదే స్వయంభూదేవాలయములోఁ జేరవలయును. మన మిత్రు ల నందరను నిచ్చట సమకూర్చికొని కర్తవ్యము నాలో చించెదము-

తేజు—అటులే కానిమ్ము. (ప్రకృతేను సెలవుతీ[illegible].

చూడా—మిత్రమా! నమస్కారములు.

(తేజుఁడు చూడాసేనుఁడు నిష్క్రమింతురు.)

శ్రద్ధా—(స్వగతము) ఈ తేజుని సహాయమున నా పగ కొంత వఱకు సిద్ధించినటులే. ఇప్పుడు తటస్థించినసంగ్రామ మందీ సుస్సలోచ్ఛలులలో నొకరు కూలినట్లైనఁ బిమ్మట తక్కిన కార్య మాలోచింప వచ్చును. నన్నీ యుచ్ఛలుఁడు కోశాధిపత్యము నుండి తొలఁగించి నందులకుఁ దగిన ఫల మందఁగలఁడు. వీనిని ధ్వంసముచేయు వఱకునాకు శాంతి యుండదు. రేపు భోగసేనుని మనస్సును గుర్తించెదను. ఇతనికి రాజుపై విశ్వాసము లేకుండునట్లు జాబులు వ్రాయించి యింటిలో వేయించి యుంటినిగదా. వాని ఫలితము జూడవలయును.



# ద్వితీయరంగము

—౦—

స్థలము — శ్రీనగరము

[భోగసేనుఁడు ప్రవేశించును]

భోగ—(ఉత్తరము చదువుచు) ........................................

"ఈకార్య సంఘటనమునకీవె సమర్థుండవు. నీ శుద్ధమానసమే నిన్ను ప్రజాహృదయ సింహాసనమున నధిష్ఠింపఁజేయుచున్నది. ప్రజాక్షోభమును బోనడఁచి దుష్టభూదారనాశనమొనర్చు భాగ్యము నీకుఁగాక మఱెవ్వరి కబ్బును. ఆలోచింపుము. ఉదాసీనము సేయకుము." ..................

ఉదాసీనమువలదా? ఆలోచింపవలయునా? అవును. ఆలోచింపవలసిన విషయమే. ఆహా! ఎంతచిత్రము. కొలఁది సంవత్సరములు రాజ్యము సేయకమునుపే యీ యుచ్ఛలమహారాజెంతటి నిందకుఁ బాత్రుఁడయ్యెను. ...ఏలనాకిట్టి యుత్తరము లనుదినము పంపఁబడుచున్నవి. ఇట్టి యుత్తరముల నాయింట నెవరువేయుచున్నారో యూహింపఁజాలకున్నాఁడను. దీని కంతయుఁ బ్రబల కారణమే యుండవలయును. లోకులు వ్యాకుల చిత్తులు కాకున్న బహుభంగుల విలపించుచు ననుఁ బోలిన వారిని బ్రోత్సహింపఁదలపెట్టరుకదా! ఉచ్ఛలా! నీ సద్గుణ ప్రసూన మరందమును నేరీతి నీదుష్టచేష్టా భ్రమరములు గ్రోలి చొక్కుచున్నవి. ఇంతలోననే యెంతటి మార్పు నీలోఁ గలిగెను.

సీ. తీవ్రాసి ధారచే దిక్కు దిక్కుల నుండు శత్రు సంఘాతంబుఁ జంపునాఁడు
హర్ష భూపాల మహాగర్వ నిర్మూల నార్జిత కీర్తిచే నలరునాఁడు
దేవతాయతనాది దివ్య నికేతన నిర్మాణ చతురత నెగడునాఁడు
ప్రాయోపవిష్టులౌ పాఱులమెప్పించి న్యాయసంస్థాపనఁ జేయునాఁడు

గీ. వర్ష దానము గురియు దివస్పతియన
దానవర్షము నిచ్చుచుఁ దనరునాఁడు

నిందితాత్మత నపకీర్తిఁ జెందలేను
చిత్ర మిపు డుచ్ఛృలుండు ద్వేషింపఁ బడియె.

పూర్వ మీతనిఁ గొలుచుచుండిన యధికార వర్గమంత యు మారిపోయెను. నావంటి వారొక రిద్దరు మాత్రము నిలిచి నారలు. మేమును

క, అరయఁ గిసలయంబులలో,
ధర డుల్లని పండుటాకు దనరినరీతిన్
విరళంబుగ లేఁ జెట్టులఁ
దనువుల వలెఁ జెలఁగిలిమి వృథా జీవులమై.

(లోపలధ్వనివిని) ఎవ్వరో ద్వారముకడ శబ్దము చేయు చున్నారు. ఏమి యీ వింత! ద్వారముపై యెవ్వరోతట్టి నంతనే నా హృదయముపై తట్టినట్లయ్యెడి. ఏల నే నింత భయ భ్రాంతుఁడ నైతిని. హృదయమా! తొందర పడకుము.

(సేవకుఁడు ప్రవేశించి)

సేవ—అయ్యా! మీతోఁగలసి మాట్లాడ వలయునని యెవ్వరో బయటి తలుపుచెంత నిలచి నారు.

భోగ—ఏమి పేరు?

సేవ—పేరడిగిన నీప్రశ్నములకు అనిపలికెను.

భోగ—రూప మెట్టిది?

సేవ—అతఁడు పొట్టిగా నున్నవాఁడు. కాని మోమును ముసుఁ గుచే దాచినందున నిట్టివాఁడని పోల్ప శక్యముగాదు.

భోగ—మంచిది. అతనిని లోపలికి రమ్మనుము.

సేవ—చిత్తము, అజ్ఞ— (నిష్క్రమించును)

భోగ—(స్వగ) మా రాజుగారి చారులు చాల చాకచక్యము కలవారు. వారికి భయపడియే యనేకులు బహిరంగము గాఁ గార్యములఁ జేయనొల్లరు. ఈ కారణముచేత కాఁబోలు నీ వచ్చిన పురుషుఁడు ముఖముపై ముసుఁగు వైచికొని వచ్చియున్నాడు.

(శ్రద్ధాసేనుఁడు ప్రవేశించును)

మిత్రమా? శ్రద్ధాసేనా నీవేనా వచ్చినది. ఎలాకో నీవు చీకటిలో శ్రమయనక నా యింటి కేతెంచితివి?

శ్రద్ధా—ఈ యుచ్ఛలరాజు సామ్రాజ్యమున నా కొక్కనికే కాదు శ్రమ, మీవంటి లోకులకును గూడఁగలదు.

భోగ—ఓయి, యెంతే చిత్రముగా మాట్లాడు చున్నావు.

శ్రద్ధా—భోగసేనా! కాలమే చిత్ర చిత్రముగ గాంధర్వనగర ములవలె మారుచున్నది. న్యాయాధిప, మన రాష్ట్రము లో నే రాజైనను వాఙ్నిరోధము, భావనిరోధము, కార్య నిరోధము గావించి యుండెనా? ఇవి చిత్రములైన యంశ ములుగావా? సభల నిరోధముచే ప్రజలను మూర్ఖులుగను శస్త్రముల యుపయోగ నిషేధముచే పిఱికి పందలుగను జేయుట దేశమునకు శ్రేయస్కర మగునా?

భోగ—ఈ శాసనముల వలన ప్రజలకుఁ జాల కష్టములు కలుగు చున్నటు లున్నది.

శ్రద్ధా—కలుగుచున్న దన నేల? ఇదివరకే కాశ్మీర జనులు—అందు ముఖ్యముగా — డామరులు నిస్తేజులై పోయినారు. ప్రజలను మూర్ఖులనుగా, నిర్వీర్యులనుగా జేయుటకన్న వారి నంకఱను వధించిన మేలుకాదా?

భో॥గ—శ్రద్ధానేనా! ప్రజలకే కాక నీవంటివారికిని నీ రాజువలన నపచారము కలిగినదని నే నెఱుఁగుదును. అందువలననే నీ మనస్సునం దశాంతి ప్రబలియున్నది.

శ్రద్ధా—నే నంతటి స్వార్థపరుఁడను గాను. నా కయిన కష్టమునకు నే నావంతయైనను జింతింపను. నావంటివారా రెందఱో యవమానితులై యుండ నా దొక లెక్కయా? భూతభిక్షుని గ్రూరజంతువుగ బ్రదర్శించినటుల సంకెలలతో నగరమందుఁ ద్రిప్పెను. లలితాంగుని తుచ్ఛవేశ్యాజనములతోఁ గూడ నాట్యమాడించెను. దంచకుఁడు- రక్షకుఁడు, అను వార లీ రాజుబాధకుఁ దాళనివారై దేశ బంధు మిత్రాదుల వదలి పాఱిపోయిరి. న్యాయాన్యాయ విచక్షణ శక్తులచే నొప్పు మీకు దీని కంతయుఁ గారణమరయఁ గష్టముకాదు.

భో॥గ—ఓయీ! నీ కొక సంగతి తెలుపవలయును. నీవు వచ్చుటకుఁ బూర్వ మిప్పు డిప్పుడే దాని విషయమై యాలోచించు చుంటిని. ఇటీవల నా కనేక "పత్రములు" రాజ ప్రతికూలముగా వ్రాయఁబడి పంపఁబడు చున్నవి. ఇదిగో దీనిని చూడుము.

(జాబు నందిచ్చును)

శ్రద్ధా—(చూచి) (స్వగతము) ఇది నేను వ్రాయించినదే. వెదుకఁబోయిన తీవె కాలనే తగులుకొన్నది. ఇది మంచిసమయము. ఇతనికి బాగుగా బురివెట్టెదను. (ప్రకాశముగా) న్యాయాధిపా! మీ కాశ్చర్యమేలఁ గలుగవలయును. మీరీ భూపతి దుర్మార్గము నడఁపఁజాలిన వారని ప్రజలు మీ మ్రోల మొరలిడు చున్నారు. కాని వేరుకాదు. మీ యట్టి ఖ్యాతి నా కుండిన నే నెంత చేసియుండను. ఆర్యా! నీ విధ్యుక్తధర్మమును నెరవేర్ప వలయును.

భోగ—ఓయి! నన్నేమి సేయుమనెదవు?

శ్రద్ధా—ప్రజలకు యథార్థమైన సంకటములు లేవియున్నవో వానిని దొలఁగింప వలయును.

భోగ—అదెట్లు సాధ్యము?

శ్రద్ధా—భావి కాలపుఁ బాలకులును బాలితులును నీ పేరును స్మరించునట్లుగా నీ రాజుకు బుద్ధిచెప్పుటయే కార్య సాధనా పద్ధతి.

భోగ—నే నెంతవాఁడ నట్టి కార్యమునకుఁ బూనుకొనుటకు?

శ్రద్ధా—గొప్పవారు తమ గొప్పతనమును దామే పొగడుకొందురా? భోగసేనా! నీ వీ యుచ్ఛలపతిని నమ్మకముతో సేవించు చుండుటచే నితని లోపములను సరిగా గమనించిన వాఁడవుకావు. ఆ కష్టము లన్నియు ననుభవించు నన్నుఁబోలిన ప్రజలకుఁ దెలియును. అనేకులు "భోగసేనుఁడు మా కభయ మిచ్చిన బాగుపడుదుము కదా" యని వగచుచు దుఃఖించుట గంటిని.

భోగ—శ్రద్ధాసేనా! నాయకుఁడెంత చెడ్డవాఁడైనను నతనికి ద్రోహము దలఁచుట చెడ్డదికాదా? రాజు విష్ణ్వంశా సంభూతుఁడని శాస్త్రములు వల్కవా?

శ్రద్ధా—మీ రింకను బూర్వాచార పరాయణులు

శా. "నా విష్ణుః పృథివీపతి" యనెడు శాస్త్రార్థంబు విఖ్యాతమే!
యా విష్ణ్వంశమునన్ జనించు నరపాలాగ్రేసరుండెన్నగా
ధీ విద్యాయుతుఁడై సమస్త జన సంతృప్తి కృతుండై కృపా
భావుండైన నతండె పో సకల సంభావ్యుండు పూజ్యుం డిలన్.

మన వేద బ్రాహ్మణములఁ జదివినఁ బూర్వకాల మందును లోకులు దుష్టరాజుల నిర్మూలించి ప్రజాపాలనమే స్థాపించి నటులఁ గానుపించెడి. పూర్వకాలమందు మన

కాశ్మీరమందే మధ్య దేశపువారు తమ రాజుల వెడల
నడచి వై రాజ్యములు స్థాపించిరి. ఇంతియ కాక, లచ్ఛ
విక, కునింద, మాలవ మొదలగు జాతుల వారును నై
రాజ్యముల స్థాపించి ప్రజాపాలనమునే వృద్ధిపరచిరనియుఁ
బెద్దలు చెప్పుదురు. ప్రజాను రంజకుఁడగు రాజే విష్ణ్వంశ
సంభూతుఁడు. అతని రాజ్యమందే జనులు స్వస్థచిత్తులై
యుందురు.

గీ. ఖ్యాతి కిరణములంతటఁ గ్రమ్మకొనఁగ
నవనిపై నుండెడిఁ దమము నణఁగఁద్రొక్కి—
కువలయంబున కధికమౌ కుతుక మొసఁగి
రాజ్యమేలెడి వాఁడె సద్రాజు సుమ్ము.

మెట్లులేని నిచ్చెన యుండదు. ప్రజలులేని రాజుండఁడు
లోకులెల్ల సన్మార్గుని నాయకునిఁగాఁ జేసి కొందరో
యటులే దుష్టనాయకుల సింహాసనములనుండి ద్రోర్లించుట
యందే దోషమును గానరాదు.

భోగ—సేనా! నీ వెంతటి యోచనా పరుఁడవు నీ యుక్తికి
మెచ్చితిని.

శ్రద్ధా—నా యాలోచనను గూడ నొప్పితివని నమ్ముచున్నాను.

భోగ—అటుకాదు. నే నింకను యోజింపవలయును.

శ్రద్ధా—(స్వగతము) ఈతఁడింకను అనుమానించుచున్నాఁడు.
కానిమ్ము: ఇంక నొకటి రెండుమాటలు చెప్పినఁ గలసి
నా మతమునకు రాకమానఁడు. (ప్రకాశముగా) న్యాయా
ధిప! నీవు సెలవిచ్చినది కడుం గడు నిక్కము. అనుమానా
స్పదమైన పనులను జేయఁగూడదు.

క. అనుమానాస్పద మౌ పను
లను జేయఁ గూడంగువాఁడె రయ రెంటికి ద

ప్పిన రే వని కరణి, క్రోశం
ఖుని బోలిన వాఁడగుచును శోభలనొందఁ.

నీకు సంపూర్ణముగాఁ దృప్తి కలిగిన పిమ్మటనే యభిప్రాయమునిమ్ము.

భోగ—ఇది మంచి యాలోచన.

శ్రద్ధా—ఇంక నాకు సెలవొసంగుఁడు. నేటి సంభాషణ విషయమై దీర్ఘాలోచన చేయుటకై పునః పునః ప్రార్థన గావించుచున్నాను.

భోగ—నీయంతటి ప్రతిభాశాలి యనేక నూతన భావములతో బోధించు చుండ నేను దీర్ఘాలోచన చేయకుందునా?

శ్రద్ధా—అత్యంతాను గ్రహీతుఁడను. ఇక సెలవు.

భోగ—మంచిది. (గృహములోనికి వెళ్లును.)

శ్రద్ధా—(స్వగతము) శేపో మాపో సుస్సలోచ్ఛ్రలులకు యుద్ధము జరుగును. అందు సుస్సలుఁడు జయమందెనా చూచుకొందము. లేక యుచ్ఛ్రలుఁడే జయించెనా భోగసేనునిక ముప్పు వాటిల్లును. ఈ యుద్ధమునకు భోగసేనుఁడును, చూడా సేనుఁడును గారకులని యుచ్ఛ్రలుని కిదివఱకే పలుమాఱు రహస్యముగా జాబులు వ్రాసిపంపి యుంటినిగదా. దీని వలన వీరు తమ పదవులనుండి తొలగింపఁబడుట నిజము. ఎటులైనను నాకార్య సాధనమున కనుపగు శుభసూచనములు కానవచ్చుచున్నవి.



# తృతీయరంగము.

స్థలము:—శ్రీనగరము.

ప్రవేశము:—ఉచ్ఛలరాజు, గర్గచంద్రుఁడు.

ఉచ్ఛల—ఎంత చిత్రము. ధర్మకాలము దిన దినము క్షీణించు చున్నట్లు తోచుచున్నది. అగ్రజుఁడగు శ్రీరామచంద్రుని దైవముగా భావించిన లక్ష్మణుని చరిత్రమును మనము పలుమారు విని యుండియు నేటి కాలమున నిట్టి విపరీత ములఁ జూడవలసి వచ్చెను.

గర్గ—భూపా, ఎవ్వరో కొందరు ద్రోహులు కలసి యీ సుస్సల రాజు గుణములనిట్లు మార్చిరికాని అతఁడింతటి ద్రోహ ము మీ యెడఁ జేయువాఁడుకాఁడు.

ఉచ్ఛ—అది నిశ్చయము. నాకును మాసుస్సలుని వృత్తాంత మం తయుఁ దెలిసెను, అది తర్వాత ఆలోచింతము. గర్గచం ద్రా నేను యుద్ధమునుండి వచ్చిన పిమ్మట యేమేమి జరి గెనో చెప్పుము.

గర్గ—స్వామీ, ఏమి చెప్పుదును. సుస్సలరాజు శల్యపురములో నున్నారని తాము సైన్యముతో నేతెంచి యచ్చటవారు లేరనియు దరద్దేశములో నున్నారనియు విని నన్నచటికిఁ బంపి తాము వచ్చితిరికదా.

ఉచ్ఛ—అవును, పిమ్మట యేమిజరిగెను?

గర్గ—ఆ సుస్సల యువరాజుగారు చతురంగ సైన్య సమేతులై యతివేగముతో మా పైకి వచ్చుచుండ నా సైన్యములు ప్రళయకాల సముద్భూతే జలధర పంక్తులో యనఁ జూప రులకు భీతి గొలుపుచుండెను.

సీ. ఘన బలంబున మించు గంధ సింధురములు నీల మేఘంబుల చాలుగాఁగ
పటుతూర్య నాదముల్ బహుభీషదంబులై యుల్లంబు గంపించు నురుములుగాఁగ
చాప సంచయములఁ జను బాణపంక్తు లసారంబుగా వర్షధారగాఁగ
కొండ చఱియలలోనుండి వచ్చు బలంబు పొలుచుండెడి సెలయేరుగాఁగ

గీ॥ అశ్వదళములు వేగమై యరుగుచుండ
ధూళి ఖురఘట్టనంబున ధూమ మనఁగ
నాకసంబున వ్యాపింప నచ్చెరువున
సైన్యయుక్తుఁడై వచ్చె సుస్సల విభుండు.

ఇట్లాతఁడు ఖగేంద్రమురీతి మూఁపై బడి సైన్యమును దాకెను.

ఉచ్ఛల—తర్వాత నేమి జరిగెను?

గర్గ—ఇరుకొలంకులవారు బహుకాలము వెనుకంజ వేయక ప్రాణముల నాశబెట్టక ఘోరముగ యుద్ధముచేసిరి. అప్పుడు

గీ. తురగములు తురగము దాకి దొర్లుచుండ
పదగులు పదగులను గొట్టి యనుముచుండ
మద్యపాయులరీతి సైన్యద్వయంబు
ముందు వెన్కఁ జూడదు గాఢ మోహరమున.

ఉచ్ఛ—అదియే శూరలక్షణము. తర్వాత?

గర్గ—అంతఁ గొంతకాలమునకు సుస్సలరాజు సైన్యము ధైర్యముఁవీడి పారఁజొచ్చెను. సుస్సలభూపతి తన గంభీరవాగ్గర్జనతోఁ దన సైన్యము నిట్లు పురికొలిపెను.

ఉ. సైనికులార! క్షాత్రగుణ సౌరభులార! వెసన్ వివేచనా
హీనత నేలపారెదరు? హేళినిబట్టియు వీఁపు నూప మీ
మానస మెట్టులొప్పె ననుమానము వీడి సుతీక్ష్ణ కాండ సం
ధానరతిన్ విపక్షతతిదారణ కర్మను జేయు టొప్పగున్.

ఇట్లనేక రీతుల వారిని బురికొల్పి మరల రణోత్సుకులనగాఁ జేసెను. వా రంత లజ్జాహత చేతస్కులై ద్విగుణీకృత క్రోధముతో మన బలములతోఁ బోరాడఁ జొచ్చిరి.

ఉచ్ఛల—చాల ప్రశంసనీయము, అటుపిమ్మట?

గర్గ—మన రాణువ యంత భయ భ్రాంతమై సడలుకొనుటఁ జూచి మూలసైన్యమును వారి సహాయార్థమైన డపి యుద్ధముచేయ సుస్సలరాజు సైన్యము సగము నాశనమగుడు తక్కిన వారు తమ కాళ్లకు బుద్ధి చెప్పిరి.

ఉచ్ఛల—నా యనుజుని వృత్తాంతమెట్లు?

గర్గ—స్వామీ! ధైర్యసాహసము లందును నతఁడు మీ తమ్ముఁడే యన వలయును. తన భటులు వెన్నిచ్చుచుండ దానఁ జలింపనివాఁడై కొంతవరకుఁ బోరాడి తన యశ్వమును ద్రిప్పికొని లోహరాభి ముఖుఁడై వెడలిపోయెను.

ఉచ్ఛల—వెంబడింప లేదా?

గర్గ—ఇందు నాతప్పు కలదు. తమ యనుజుని బట్టి యవమానించుటకు మీ భృత్యుని కిచ్చ పొడమలేదు.

ఉచ్ఛ—సేనానీ, నీ యౌదార్యమునకు మెచ్చితిని. నాకును వానిపై కోపమేమియును లేదు సుమా. వానిని బూర్తిగా మన్నించితి ననియు, యథాప్రకారము లోహర నేలుచుండుమనియు నా మాటగా వ్రాసిపంపుము. మాకుహనా మిత్రులు కొందరు వాని గుణముల మార్చిరని నా కనుమానము కలిగియున్నది.

గర్గ—వారెవ్వరో తెలిసికొనవచ్చునా?

ఉచ్ఛ—నీతోఁ జెప్ప కేమి? చూడా సేనుఁడును, భోగసేనుఁడును దీనికంతయు ముఖ్యకారకులని నాకుత్తరములు కొన్ని పంపబడినవి. తేజనిమూలమున వారుమాసుస్సలునికి తప్పుడుబోధలు చేసిరని తెలియవచ్చినది.

గర్గ—అహా! ఇంతటికార్యము వారివలనఁ కలిగెనా? నేనిది నమ్మఁజాలను.

ఉచ్ఛ—అనుమానమొకటి యంకురించినదికదా. ఇంతేకాక తేజుడిటకు వచ్చినవారములోనే సుస్సలుడు యుద్ధమునకు వచ్చెను. తేజుడువచ్చినప్పటినుండి చూడాసేన భోగసేనులతో పలుమారు కలిసి యేమేమో రహస్యాలోచనలు చేసినాడని మాచారులు తెలిపినారు.

గర్గ—మహారాజా, చూడాసేనునివిషయము నేను జెప్పఁజాలను గానిభోగసేనుఁడెప్పటికిని ద్రోహమునుదలంచువాఁడు కాఁడు. అత్యుత్తముఁడని నాయభిప్రాయము.

ఉచ్ఛ—అయిన నిట్లుచేయుదును: సంశయ నివారణంబగువఱకు వీరిని నుద్యోగమునుండి తొలఁగించెదను.

గర్గ—అట్లుచేయుట సమంజసముగా నుండదని నమ్ముచున్నాను. అందుపై దేవరవారిచిత్తము.

ఉచ్ఛ—అనుమానము పాయునంతవఱకే యట్లు వారిని నధికారచ్యుతులనుగాఁ జేయుదును. వారు నిర్దోషులని నాకు విశదమయ్యెనేని వారిని మఱింత గౌరవముతో సన్మానించి యున్నతస్థానములందు నెలకొల్పుదును. కావున నీవు చింతింపవలదు.

గర్గ—ప్రభువుగారి చిత్తము.

(నిష్క్రమింతురు.)





# ఉచ్ఛ్రల విషాదము.



## తృతీయాంకము.



### ప్రథమ రంగము.



(స్థలము శ్రీనగరమందు. స్వయంభూ దేవాలయము.)

(తేజుఁడు, హంసరఘుఁడు, ప్రవేశించుచురు.)

**తేజు**—హంసరథా, ఉచ్ఛ్రలమహారాజు తనతమ్మునిపై జయమం దెనని వినినప్పటినుండియు నిప్పుద్రొక్కిన కోతివలెనైనది నాయవస్థ. నేఁజేసిన ప్రయత్నములన్నియు బూదిలో హో మము చేసినట్లయ్యెను. ఈ క్రూరునికి దైవబల మింకెంత కాలమున్నదో యేమో? దురాత్ముల కభివృద్ధిని సన్మార్గు లకు క్షీణదశను బ్రాపింపఁజేసిన యాబ్రహ్మదేవుని నేమ నిదూరవలయును? ఈరాజు తన నూతనవిజయముచే మ దాంధుఁడై మనబోటివారి నింకెంత వ్యాకులపెట్టునో కదా!

**హంస**—మన శ్రద్ధాసేనుని సామర్థ్య సాహసములవలన మనము త్వరలో నీచండశాసనుని నిర్మూలించి యెదపై చేయిడి కొని నిద్రింపగలము,

తేజ—హంసరథా, నిన్నటివృత్తాంతమువింటివా?

హంస—అదేదో చెప్పుము.

తేజ—న్యాయాధికారివై యుచ్ఛలుని కత్యంతప్రీతిపాత్రుఁడై యుండిన భోగసేనుఁడు నిష్కారణముగ నిన్న తనయుద్యోగమునుండి వెడలింపఁబడెను. మఱియు నగరరక్షకుఁడైనచూడాసేనుఁడుకూడ నిట్టిగౌరవమునే పొందియున్నాఁడు.

గీ. ఆప్తవర్గంబు నంతయు నవలఁద్రోసి
స్వీయశక్తి నెనమ్మి బుద్ధిహీనుండు
త్రోవఁజూపెడివారలఁ ద్రోసిపుచ్చి
చేతకట్టెనె నమ్మెడు చీకుకరణి.

హంస—అవును, ఈ సంగతినేనుగూడ వింటిని ఇదంతయు మన శ్రద్ధాసేనుని చాకచక్యమేసుమా! భోగసేనుని విషయమై రాజుగారికి నిందారూపకముగా వార్తలంపితినని శ్రద్ధాసేనుడు మనకా నాడు తెలిపియుండెను గదా! తప్పకదాని ఫలితమేయిది. కాని చూడాసేనుని నేల యుద్యోగము నుండి తొలగించెనో యూహింపజాలము.

తేజ—ఇందేమి యాశ్చర్యమున్నది? నూతన ప్రియులుకదా పార్థివులు.

(చూడాసేనుఁడు భూతభిక్షుఁడు ప్రవేశింతురు.)

తేజ—చూడాసేనా, నీయుద్యోగము పోయినప్పటినుండి నీ కెట్లున్నదో చెప్పుమా.

చూడా—వీపుపైనుండి పెద్దబరువు జాఱిపడినట్లున్నది.

తేజ—భూతభిక్షూ, క్షేమముగానున్నావుగదా.

భూత—బ్రాహ్మణోత్తమా, నీకునమస్కారము.

తేజ—దీర్ఘాయుష్యమస్తు. కార్యసాఫల్యమస్తు.

హంస—ఏమయ్యా, మంత్రములకు మామిడికాయలు రాలునా? నీయాశీర్వాదముచేతనే, కాబోలు మనకు కార్యసాఫల్య మగునట.

తేజ—చూడుము, నాదే మొదటిదెబ్బ. భూతభిక్షూ నిన్నానాడ నుమానించిన రాజుగారి ఋణమును నేనేతీర్చువాడను సుమా.

భూత—అట్లైన పై వడ్డీని నేనుజెల్లించుదును లెమ్ము.

చూడ—మిత్రులార, భోగసేనుడు స్థానభ్రష్టుడగుటచే నింక మన కుసహాయభూతుడుగా నుండునని నమ్ముచున్నాను.

తేజ—చూడా, మేమింతవరకీ సంగతిని గూర్చియే ముచ్చటించు చుంటిమి ఈ మహారాజుతనను గొలుచు వారి నందఱను దఱిమి చేయుట యంధప్రక్రియగా నున్నది.

భూత—ఇంకను శ్రద్ధాసేనుడెందుకో రాలేదు.

(ప్రవేశము ప్రయాగుడు)

హంస—అనుచుండగనే శ్రద్ధాసేనుని తమ్ముడు వచ్చిచేరెను. ఓ యీ ప్రయాగ, ఏలనీ యగ్రజుడింకను రాలేదు?

ప్రయా—ఆతడు భోగసేనుని వెంబడించుకొని గృహమునుండి బ యలు దేరుచు నన్ను ముదంపెను. క్షణకాలములోపలనే వారిరువురును నిచటికి రాగలరు.

తేజ—వహ్వా భోగసేనుడు కూడ మనతో నేకీభవించినాడా? ఇం కమనము విజయమందుటలో సంశయింపఁబనిలేదు.

చూడ—ఓయి, శ్రద్ధాసేనుడెంతటి గడుసువాఁడో చూడుము. భో గసేనునంతటి వానిని వశీకరించుకొనెను.

(శ్రద్ధాసేనుఁడు, భోగసేనుఁడు ప్రవేశింతురు)

శ్రద్ధా—కనుఁడు, మనహంసరథుఁడు, నగర రక్షకస్థాన పరిభ్రష్టుఁడైన చూడా సేనుఁడు, తిలకుని బంధువగు తేజుఁడు, అవమానితుఁడైన భూతి భిక్షుఁడు, వీరందఱును మీ కొఱకు నిరీక్షించుచున్నారు. దేశారాధకులారా, నేఁడు మనకుఁ బుణ్యదినము. సర్వజన వంద్యులైన భోగసేన మహాశయులు ప్రజా సంక్షోభ పరిశమనార్థమై మనకు నాయకులై కార్యమునడుప సంసిద్ధులైయున్నారు. కలమరిచేతినావయునుబోలె మన యుద్యమము వీరిచే విపదంబుధినుండి తరించుటలో నేమిసందేహము? ఇంకజాగేల, కార్యాలోచనము సేయుదము. అందఱును నాసీనులగుఁడు.

(అందఱు కూర్చుందురు.)

భోగ—స్నేహితులారా; బహు సంఖ్యాకుల మేలుకొఱకై యొక్కనికిఁ గష్టము గలిగింపవలసి వచ్చినది. మన విధ్యుక్త ధర్మమును మనము చేయువారము. కావున మన యాచరణీయములను మనము బాగుగా నాలోచింపవలయును.

శ్రద్ధా—ఎంత త్వరగా నుచ్ఛలుఁడంత మొందిన నంత శ్రేయస్కరము.

తేజ—అవును, మేమా సంగతి గమనించి యున్నారము.

శ్రద్ధా—ఎన్నఁడు మన మికార్యమొనరింప వలయునో తెలుపుము.

భోగ—రేపు పుష్యశుద్ధ షష్ఠినాఁడు మనమికార్యమును సాధించుట బాగని తోఁచెడిని.

శ్రద్ధా—మంచిది. మీరు వల్కు రీతినే చేయుదము. కాని యే కాలమం దీ పనిఁ జేయుట శ్రేష్ఠము.

భోగ—రాత్రి కాలమే యుత్తమ సమయము.

సీ. నీలకంబళమందు నిశి జారచోరులఁ గరుణతోఁ గాపాడఁ గడఁగునపుడు
తారాకిరీట యుతంబైన శిరముతో యామవతీ దేవి యలరునపుడు
తనతటిద్ధారచ్యుతంబైన తుహినతుషారమౌక్తికములు జాలునపుడు
బహువిధ దీపికల్ బహళంపు దివ్వటీకాంతుల వెలుఁగొంది క్రాలునపుడు

తే. గీ. శాస్త్రముల విప్పి వృద్ధులు సదువునపుడు
చుక్క గుంపుల సిద్ధాంతి చూచునపుడు
అర్ధగోళంబుపై మబ్బు లలరినపుడు
ఉచ్ఛలుని యంత మొందింప యుక్తమౌను.

కావున రాత్రి సమయమే సరియైన సమయము.

చూడా—ఒప్పితిమి. కాని ఈ సంహార కార్యమందు ప్రథమాచరణ మెట్లు?

తేజ—అయ్యా, నా ఖడ్గము ముందా రాజ శరీరమునఁ దన యొఱను జూచికొనవలయును.

శ్రద్ధా—అట్లుగాదు, తేజా, అట్లుకాదు. జనకచంద్రుని బరిమార్చి కాశ్మీరమునుండి వెడలిపోయిన తిలకుఁడు నీకు ముఖ్య బంధువు కదా. అతఁడు మరల కాశ్మీర రాజ్యమును బ్రవేశించెననియు రాజుగారి పూర్వాజ్ఞచే నతఁడు పట్టువడె ననియు మిషపెట్టి నీవు రాజు దగ్గఱ చేరి తిలకుని క్షమాపణార్థమై ప్రార్థించుచుండుము. అతఁడు నీతో వాదించునపుడు హంస రథుఁడు వెనుకనుండి తన ఖడ్గ ధారచే నాతని రక్తధారల బయటకుఁ బ్రవహింపఁ జేయును. హంసరథా నీ కిది సమ్మతమా?

హంస—ఇంతకన్న నెక్కుడు గౌరవమైన కార్య మేది? అవశ్యము నేనీ పని నాచరించుదును.

శ్రద్ధా—అంత మేమందఱమును అతనిని ముట్టడించి మట్టుపెట్టుదుము.

భోగ—మిత్రులార. ఒకమాట. మన యుద్యమ ముత్తమ పద్ధతులతో నొప్పినదై యుండవలయును. మనము రాజ్యాంగమందు దురహంకార దౌర్జన్య జాడ్య పీడితాంగమును ఛేదించు నొజ్జలమే కాని కౌర్యము వహించి రాజేతర సంహారమును జేయు రుధిర పిపాసులము కాము.

శ్రద్ధా—సత్యము. సత్యము. మన మితరుల కెంత మాత్రమును హాని గలిగింపఁ గూడదు. మిత్రవరులార. ఈ ఘనోద్యమమును మీ రధికభక్తి విశ్వాసములతో జయప్రదంబుగా వింపఁ బ్రార్థించుచున్నాను. మన మీ యనధిలో నెంత మాత్రమును రహస్యమును వెల్లడిచేయమనుటకై శపథములను జేయవలయును.

తేజ—చేయుదుము. ఇది మంచి యాలోచన.

చూడ—మే మందఱమును నెట్టి శపథములఁ జేయు మనినఁ జేయువారము.

భోగ—అటుకాదు. అటుకాదు.

ఉ. లోకమునందు దుష్టులు విలుప్త మతుల్ మఱి నీచు లెల్లచోఁ
బ్రాకృత రీతులన్ శపథ పద్ధతిఁ బూనుదు రంతెకాని, య
త్యాకుల పాటునన్ బ్రజల యార్తిని మాన్పఁ గడంగు వారికిం
బ్రాకట ధుర్యులార! తలఁపన్ శపథంబులు వ్యర్థమే కదా.

కావున సత్పురుష వాగ్దత్తమే యొక్క సాక్షి. వారి యంతరాత్మయే ద్వితీయసాక్షి. సద సద్వివేచనా చతుర మతులైన పెద్దల యభిప్రాయమే సర్వసాక్షి. కాన నీ తలఁపు నుజ్జగింపుఁడు.

శ్రద్ధా—నాయకా, మీ యభిప్రాయమునకు నమ్రుల మగు చున్నారము.

భోగ—సాహసులార, ఇంకేమయిన నభిప్రాయముల నిచ్చువా రైన నీయగలరని కోరుచున్నాను.

తేజ—ఇంకేమియు లేదు.

ప్రియా—యోజింపవలసిన దంతయు నయ్యెను.

భోగ—మన మాచరించు కార్యమునకు దైవ సహాయ మవశ్య ప్రార్థనీయము. ఈ జగదీశుని నెవరికిఁ దోచినట్లు వారు భజింపవలయును.

(అందఱును జేతులు జోడింతురు)

భోగ— మానిని.

సాపకలోచన, భక్త విమోచక, పర్వతచాప కరాబ్జ! హరా
భావజగర్వ విభంజన, దైత్య విపాటన దక్షక, దక్షహరా।
పావన మౌని వశంకర, శంకర, పాప సమూహ వినాశకరా।
ప్రోవవె దీనుల, నార్త జనంబుల, భూరి ఫలంబుల నిచ్చి కృపన్.

శ్రద్ధా— —♦ దండకము ♦—

శృంగారగాత్రా, భుజంగేంద్రభూషా, యనంగారి, దక్షాధ్వరధ్వంస దక్షా, భవత్సేవకాసక్త సంరక్షణాధ్యా, మహాభక్త మౌనీంద్రపక్షా, సతీవక్ష కేళీ విలోలా, మహాపాప జాలాంతరాకర్ష తాత్మీయ తన్వంగపాలా, ప్రతాపానలాభీలకీలాతిదగ్ధ దహ్యామానాసురారాతి గర్వాటవీనేత్ర, చంద్రార్థ చూడామణీ, మమ్ము రక్షించి, రక్తిం గటాక్షించి వీక్షించి మోదంబు సంధించి కావ్యంబు సాఫల్య మొందింపవే, పార్వతీశా, మహేశా! నమస్తే పునస్తేనమః!

తేజుడు— ఉపేంద్ర వజ్రము

అనంగవైరీ! గిరిజార్ధ నారీ! మునీంద్ర రక్షా! అతిపూత గాత్రా!
విసిల కేశా! పృథివీ మహేశా! త్రినేత్ర భాసా! శశితేజ హాసా!!

భోగ—మిత్రులార. ప్రొద్దంతమై యుండవచ్చును.

ప్రయాగ.—మన యాలోచన ప్రార్థనాదులు చేయుసరికిఁ గోడి కూయువేళ మైనది.

భోగ—ఆహా! ఎంత త్వరగాఁ బ్రొద్దు మన మాటల సందున జాఱిపోయినది. ఇంక త్వరలోఁ బ్రొద్దు పొడచు నేమొ.

తే॥ గీ॥ కొంత సైపవె యో యుషఃకాంత, యింత
తొందఱవలదు, మాకు సంతుష్టి గలుగ
నేను నీలకంబళమందు నిద్రజెందు.
మఱణ కుసుమంబు నీకు సమర్పణంబు.

కార్యబంధులార, ఇంక జాగ్గైన మనము గుర్తింపఁబడుదుము. త్వరిత గతిని మీ మీ గృహములకు వేరు వేరు మార్గముల నరుగుఁడు. మన మందఱము చీఁకనప్పుడొక సంగతిని జ్ఞాపకము చేసెదను. మీ మీ ఖడ్గముల సాన బెట్టుడు. వాని తళుకులందు మన చులుకుఁదనము వెల్లడి యగును.

శ్రద్ధా—శుక్లపక్ష షష్ఠీ రాత్రి సమయమును మఱవకుడు.

తేజ—చిత్తము. అయ్యా, మే మిటు పోయెదము.

[ తేజ, హంస. నిష్క్ర—]

భోగ—శ్రద్ధాసేనా, రమ్ము మన మిటు వెడలుదము.

[ అందఱును నిష్క్రమింతురు]

## ద్వితీయ రంగము

---

( ప్రశస్థ కలశుఁడు ప్రవేశించును )

ప్రశ-(స్వగతము) ఏమీ యీచిత్రేమ. నేనసంతరాజ కలశరాజ హర్ష దేవ మహారాజుల పరిపాలనములఁ జూచితిని గాని యీ యుచ్ఛల భూపతి ప్రభుత్వమున నేఁ డతి చిత్ర భయానకములగు సూచకములను జూడవలసి వచ్చెను. హర్ష రాజు గతించిన కాలమున భూకంపమును తుపానులు ను మాత్రము సంభవించెను. నేఁడహహో! భూమ్యాకాశ మంతయుఁ గుమ్మరి సారె తిరిగినరీతి ఘన ఘటా ఘోష ఘుర్ఘురధ్వానులచేఁ గకుబంతర కర్పర భేదనఁబుగా వించుచు వాతా ఘాత పతిత వృక్ష సంఘాతంబు చేతను నతి ధీరుని సహితము భీరువుగాఁ జేయుచున్న నీ దైవ సూచ కంబులఁ జూడ నా మనస్సు చింతా వ్యాకులతలఁ జెందు చున్నది.............నన్నీ యుచ్ఛల మహీపాలుఁ డీ సందిగ్ధ సూచకముల విషయమై యాలోచించుటకుఁ దన నగరునకు రమ్మని యాజ్ఞ పంపెను. మహారాజు గారి దివ్య ప్రాసాద మదుగో కానవచ్చుచునే యున్నది. ఇంక జాగేల?

( ముందరిగి ) ఎవ్వరో యిటు వచ్చుచున్నట్లున్నది.

[ ప్రవేశము - తేజుఁడు ]

తేజ—( స్వగతము ) రాజుగారు తమ పురోహితుని శుభా శుభ ములు నరయుటకై రమ్మని యాజ్ఞాపించిరి. పురోహితు నతి ప్రయత్నముతో నన్నీ పనికిఁ బంపునటుల నొప్పించి తిని ఇఁక తక్కిన కార్య మంతయుఁ జక్కఁబెట్టికొందును.

ప్రశ— తేజ--ఏమో ఛాల యాలోచించుచున్నావు.

తేజ—ఓహో! మంత్రిగారా, మిమ్ము చూడక బహుకాల మయ్యెను. నే నేమియు విశేష మాలోచింపలేదు. నేఁడే మింత భయంకరముగా దినము గడచు చున్నది అని చింతించుచుంటిని. సూర్య భగవానుఁ డిప్పు డే దిశయం దున్నాడో తెలియఁజాలకున్నాము.

ప్రశస్థ—తేజా!

గీ. ఘూకములు మిక్కుటంబుగఁ గూతలిడుచు
భీతి నిచ్చుచు నున్నవి ప్రియవయస్య
కంటివే దీని ఫలిత మే గలియొకాని
దుష్ట శకునంబులని వాసఁ దోచు సుమ్ము.

నాలు గైదు దివసములనుండి ధూమకేతు వొకటి కనఁబడుచున్నది. చూచితివా? అయ్యది కనఁబడిన రాజులకు ముప్పని పెద్దలు చెప్పుదురు.

తేజ—(స్వగతము) మనమా. తొందఱ పడకుము. (ప్రకా) ఈ యభిప్రాయమును బండితు లొప్పుకొనరు. మఱియు నొక వేళ నట్టి స్థితులే కలుగు టసంభవ మయిన మన భూపాలునికి మాత్రము కష్టము లేమియుఁ గలుగకుండుగాత మని ప్రార్థించువాఁడ. (స్వగతము) ఇతని నింకొక ధోరణి లోనికిఁ దీసికొని పోయెదను. (ప్ర) సచివ చంద్రమా! ఈ పుష్యమాసమందుఁ జలి యెంత బాధా కరముగా నున్నదో చూచితిరా?

గీ. ముదిమిచేఁ గంపమొంది చూపులను సకల
జనులఁ దర్జించి, వణకించి స్పర్శచేత
మంచు గడ్డంబు చలి గాఁడు మలలనుండి
మెల్ల మెల్లన నేతెంచెఁ బల్లములకు.

ఉ. రాత్రులు దీర్ఘము॰ శశికరమ్ములు తీక్ష్ణములౌ ప్రియాంగనా
నేత్ర నివారితంబయి వినిర్మల నిశ్చల చిత్తవృత్తి చా
రిత్రుల బ్రహ్మచారులను రిక్తుల నేచుచునుండు నీ చలిక్
జిత్రము కాచ యోర్చికొన చెంగట నెచ్చెలి లేనివేళలన్॥

ఈ హేమంత ప్రభావము వర్ణనాతీరము.

ప్రశ—తేజా—హిమవత్పర్వత భగవాను నాశ్రయములో నుండిన మనకిది యేమియుఁ జిత్రముగాదు కాని నిన్న రాచనగరు లోఁ జరిగిన సంగతి వింటివా?

తేజ—(స్వగ) మరల నీతఁ డదే కథకు వచ్చెను. కానిమ్ము. విందుగాక (ప్రకా) మంత్రి శేఖరా. మన మీ దినము లలో నాశ్చర్యములందే జీవించుచున్నారము. అదేదో సెలవిండు.

ప్రశ—మనరాజుగారి భార్యయైన బిజ్జల దేవిగారు భయోత్పా తములగు స్వప్నములఁ గనెనఁట. మహారాజుగారు తాను గొండలచే ఛేదింపఁబడినట్లు కలలోఁగాంచి యులికిపడి నిద్రలోనే రోదనము జేయఁదొడఁగెనట.

తేజ—ఆశ్చర్యము! ఆశ్చర్యము!! రాజుగారి కీ సంగతి నివేదింపఁ బడెనా లేదా?

ప్రశ—బిజ్జలదేవిగారే తెలిపిరఁట. స్వప్నములు భ్రాంతిదము లనియు నమ్మదగనివనియు, నొకవేళ నిజమే యగుచోఁ దాను వానిని సరకుసేయఁడనియుఁ దెలిపెనట. భూసురా. ఇంక నాకుఁ బ్రొద్దయ్యెడి. పోవలయును.

తేజ—తమకు శ్రమయిచ్చినందులకు క్షమింప వలయును. తా మెచ్చటికి నెడలుచున్నారో తెలుపఁగలరా?

ప్రశ—రాజదర్శమునకై.

తేజ—నిలు నిలుము. నే నదే కార్యార్థమై పోవుచున్నాను, మీ రెందుల కేగుచున్నారో యరయవచ్చునా?

ప్రశ—ఈ యమంగళముల నివారణార్థ మరయుటకు.

తేజ—నేను అందులకే వచ్చుచున్నాను ఇదిగో! పంచాంగము చంకలోనే యున్నది. రాజ పురోహితుఁడు రాజాలక గన్ను దనకు మారుగాఁ బంపెను.

ప్రశ—అట్లైనఁ గలసి పోవుదము రమ్ము. (నిష్క్రమింతురు)

## తృ తీ య ర ం గ ము.

---

(ఉచ్ఛలుఁడు బిజ్జలతో మాట్లాడుచుండును)

బిజ్జ—నాథా, అబలలపలుకు లిట్టివేయని నాప్రార్థనల నవలఁద్రో యవలదు. నాయక్కఱ చిన్నఁబుచ్చకుమా. మిము వేఁడెద.

క. భూపా! తాపంబొదవెడి
ఏపాడు కలలఁదలఁచిన; నెవ్విధినైనన్
నాపలుకులఁ ద్రోయకుమా
కోపింపకుమా! యొకింత కూరిమినినుమా

మీరునేఁడీ శుద్ధాంతమును వదలి బయటకేగఁగూడదని యతిదీనముగాఁ బ్రార్థించుచుదానను.

ఉచ్ఛ—ఏమియీపిచ్చి. జగద్విఖ్యాత ప్రతాప తేజుండనై మహా ఘోర సమరసాగరతరంగములపై విహారతత్పరుఁడనగు నాకు గృహాంతర హంసతూలికాశయనంబుత్సాహంబు నిచ్చునా?

ఉ. వైరిమదంబుఁబోనడఁచి పాలనజేసితిఁ బ్రోచితింబ్రజన్
భూరిధనంబుఁ జేర్చితిని భూవలయంబున ఖ్యాతిగాంచితిన్
శూరక యుద్ధమందు ధృతిఁబాయక ఖడ్గమువీడకుండ భూ
భారము మోసితిన్ దుదకు భామలచెంత వసింపవచ్చెఁగా.

దేవీ! నీవెంతదీనభావముతో ననువేఁడినను నామనస్సొప్పకుండెడిని.

బిజ్జ—మీరు నన్నెంతటి దుస్సాధ్య కార్యములఁ జేయుమనినను జేయుదానను. నన్ను బరిపూర్ణానురాగముతో బ్రేమించిన మీరు నాప్రార్థన మంగీకరింతురుగాక.

ఉచ్ఛ—ప్రేయసీ. నీపట్టినపట్టువదలుము. ఏకరీతిగాఁ గుహూకుహూరుతముసేయు కోకిలవలె నూరక యీవిషయమునే

యేల చర్చించెదవు? నాకు నేడేమియుఁ బ్రొద్దుపోవుటలేదు. కావునఁ గొంతసేపు చతురంగమాడుదమురమ్ము.

బిజ్జ—మీ కెప్పుడును నీచతురంగపుఁ బిచ్చియే. నామనోరథము ను నెరవేర్చినపిమ్మట తక్కినవిషయముల గుఱించి మాట్లాడుదము.

ఉచ్ఛ—నీవెన్ని చెప్పినను సమ్మతించెదనుగాని నగరులోపల నేఁ దాగియుండుమనుమాట నెంతమాత్రమును సహింపను.

బిజ్జ—అయ్యో! పురుషులెంత కఠినహృదయులో కదా.

మ. అకటా! నాయెడఁ బ్రీతిదప్పితివె? నాథా! దీనభావంబుతో
నకలంకాత్మత వేఁడ మీహృదయ మత్యంతాద్భుతప్రక్రియన్
బ్రకటించెం గఠినత్వమద్ది శిలయో! వజ్రంబొ! లోహంబొ! నా
నికనైనం గరుణాపథంబుగొనుమా! యేమిమ్ము బ్రార్థించెదన్.

మనోనాథా, మీమనస్సు నెటులరంజింపఁ జేయవలయునో తెలియకపోయెనే.

(ప్రశస్థకలశుఁడు తేజుడు ప్రవేశింతురు)

(ఇద్దఱును నమస్కరింతురు. ఆదేశముచేఁ గూర్చుందురు)

బిజ్జ—సచివాగ్రణీ, నేనింతవఱకీ భూపతిని నిర్బంధించితిని. ప్రార్థించితిని. బుజ్జగించితిని. ఏమిచేసినను నామాటలను జెవి నిడడయ్యెను. మీరైన నొకింత నాకుసాయపడరా?

ఉచ్ఛ—ప్రశస్థకలశా, మంచిసమయమున వచ్చితివి. ఈదేవినా కుఁ బ్రాణాపాయముకలుగునట్లు కలగనెనట, నాకిరీటము తటాలున డుల్లిపడినట్లును నాఖడ్గము హస్తమునుండి మాయమైపోయినట్లును, అనేకులు నన్నుచుట్టి ఖడ్గములతో బొడిచినట్లును, నింకనునేమేమో తానుచూడఁజాలకపోయి నట్టి ఘోరదురంతములను కలలో గాంచినదఁట. అందుచే నన్నింటనేదాగుమని మందలించుచున్నది. నీకిది సమ్మతమా?

ప్రశ—నరేంద్ర! నేనును సాధ్వీమతల్లియగు నీదేవిగారితోఁ గూడ పొఱపాటు బడితినేమొ. మీరు బయటకుఁ జనవలదనియే నా యభిప్రాయము. ఈ స్వప్న వృత్తాంతము గొప్ప దుర్నిమిత్తమును సూచించుచున్నది. శుభాశుభ శకునములు కొన్ని కొన్ని సమయములలో తత్తత్ఫలముల నిరూపించి తీరునని పెద్దలు చెప్పుదురు. ఇట్టి దుర్నిమిత్తముల పరిహారార్థమై దైవజ్ఞులనుగూడ విచారించి తదుచితమగు శాంతి క్రియలనుగూడఁ గావించుట మంచిదని నా యభిప్రాయము. అందుపై మహారాజుగారి చిత్తము.

బిజ్జ—అన్నా, దీర్ఘాయుష్మంతుండవై వర్ధిల్లుము.

ఉచ్ఛ—బిజ్జలా! చూచితివా! మనమంత్రి నీకన్న నాల్గాకులెక్కువగా జదివినట్లున్నది. నీవునన్ను శుద్ధాంతమందు మాత్రమే యుండఁగోరితివి. ఇతడు పైగా దైవజ్ఞులనుగూడ విచారించి శాంతిక్రియల జరుపుమనుచున్నాడు. —సరేకాని-నేను మన పురోహితుని బిలువఁబంచియుంటిని. ఇంకను నే కారణముననో రాకపోయెను.

తేజ—మహాప్రభో! అతని యాత్మబంధువొకఁడు నిన్నటిదివసము పరమపదము చెందెనని వార్త వచ్చెను. కావున నతనికి నేఁడశుచియగుటచే నన్నీ పంచాంగముతోఁ దమసాన్నిధ్యమున కంపెను.

ఉచ్ఛ—కానిమ్ము. తేజభట్టారకా. ఏదీ. నీజోస్యమెట్టిదో చూచెదము.

తేజ—మహారాజా, కొంచెము చిత్తగింపవలెను. జ్యోతిశ్శాస్త్రరీత్యా దుస్స్వప్నములనగాఁ గలలోఁ గ్రూరజంతువులు, నువ్వులునూనె ఎముకలు, ఎనుబోతు, దొంగలు, క్రూరులు ఇట్టి విషయములనే చూచిన దుశ్శకునములుగా లెక్కపె

ట్టినారుగాని కిరీటము తనంతట తానే క్రిందపడుట, ఖడ్గము తనంతట తానే మాయమగుట, యిటువంటివి దుస్స్వప్నములలో చేరినవి కావు.

ఉచ్ఛ—వింటివా బిజ్జలా! తేజుని కింత పాండిత్యమున్నదని నాకిది వరకు తెలియనే తెలియదే.

తేజ—మహా ప్రసాదము! రాజుగారి కింతమాత్ర విశ్వాస మీ యాశ్రితునిపై యుండిన నింకకొన్ని గంటలలోపలనే నా పాండిత్యమంతయు ప్రకటింపకుందునా?

బిజ్జ—నాథా! ఈతడు కేవలఛాందసుడు, ఇంకను యనుభవములేని వాడు, ఇతనిమాటల మీరు పరమ ప్రమాణముగా గ్రహింపవలదు. (తేజునితో) ఏమండీ! అవధానులవారు!

తేజ—చిత్తము! చిత్తము! సెలవియ్యండి.

బిజ్జ—దుష్టస్వప్నములెట్టివో నాకు బాగుగాఁ దెలియునుగాని అట్టివానికి శాంతి యేదైనకలదా లేదా?

తేజ—చిత్తము! అమ్మయ్యగారు! శాంతిలేకయేమి! ప్రజలందఱు మెచ్చుకొనునట్లుగా శాంతిక్రియలు నేనే చేయించుదును చూడండి. అవసరముండిన నీనాడురాత్రియే మొదలుపెట్ట గలను. నేనిదివరలో నెన్నియో శాంతిక్రియలు, హోమములు, యజ్ఞయాగాదులు చేయించినాను. ఇన్ని చేయనిదే నాకు శారదాపీఠమువద్ద "దైవజ్ఞరత్న" అని బిరుదమును పండితులూరకయిత్తురా?

బిజ్జ—సరే. దైవజ్ఞరత్నావధానులూ! దయచేసి యేమేమిశాంతి క్రియలు చేయవలెనో సెలవిండు

తేజ—చిత్తగించండి! లక్షరుద్రజపాలున్ను, నవగ్రహ పూజలున్ను, చండికా స్వయంభూపూజలున్ను జరిపింపవలెను. మరియు బ్రాహ్మణులకు గోదాన, భూదాన హిరణ్యదానాది షోడశ మహాదానములను క్రమముతప్పకుండ తుష్టి

పూర్తిగా నియ్యవలెను. ౧౦౦౦ మంది బ్రాహ్మణ దంప తీపూజలు పట్టు పీతాంబరాది వస్త్రయుక్తముగా ఆకంఠ పంచభక్ష్య పరమాన్న సంతర్పణ యుక్తముగా భూరి దక్షిణ యుక్తముగాఁ జేయవలెను. మఱియు జపాలకున్ను గ్రహశాంతికిన్ని కావలసిన సామగ్రిని మనవిచేసికొందును. చిత్తగించండి.

ఉచ్ఛ—ఉండవయ్యా! ఊరక వాగుటేకాని. వైదిక ఛాందసము నీకుగూడ బాగుగనే పట్టినట్లున్నదే. నీ పూజాద్రవ్యముల పట్టిక యనంతరమిూ దేవిగారికిఁ జూపించి తెప్పించుకొ నుము. ఇప్పుడు నాకదంతయు నవసరములేదు. ఈనాడు నాగ్రహ బలమెట్లున్నదో చెప్పుము అంతే.

తేజ—మహాప్రభో! నేడు పుష్య శు ౬ తిథి

(అని తిథివార నక్షత్రాదిలెక్కలు పఞ్చాఙ్గరీత్యా చెప్పును)

నేటి రాత్రికాలము తమ కతిశాంతి సమయము. మహా శుభకరమైన సమయము.

ఉచ్ఛ—తేజా నీపాండిత్యమునకు మెచ్చితిని. నీవాక్కులు నా కానందమననుసంధించెను. దేవీ, మంత్రీ, మీూకు స్వప్న ములు పక్షులపాలిటి, వెఱబొమ్మల వంటి వైనట్లున్నవి. మృత్యు వాసన్నమైనవేళ నింటనుండిననేమి, యటవీ ప్రదే శమున నుండిననేమి? లోకములో నేది శాశ్వతమో చూ డుమా!

సీ॥ ఘనసువాసనలిచ్చి గాలికిఁ దలయూచి మఱునాఁడువాడునే మల్లెపూవు।
చీకటిని బరిహసించి శోభిల్లి యాక్షణమె నశించునే చంచలంబు।
కెంపుజాయలనింపు సొంపులనలరారి వాడియూడునుగదే పల్లవంబు।
సప్తవర్ణముల తేజంబుతోవిలసిల్లి తలఁగునంతటనె యింద్రాయుధంబు।

తే. గీ. ఇహము శాశ్వతంబై యుండదేరికైన।
మంచివస్తువులన్నియు మడియుఁదర్వరగ।
జావుబ్రతుకులు వర్తించుఁ జక్రగతిని।
దానిమీరలు చింతింపఁ దగదుతగదు॥

బిజ్జల—ప్రాణేశ్వరా, ఏలమీరిట్టి కఠిననిశ్చయ మూనితిరి. నాకుఁ గలిగిన చెడ్డకలలే కాక యితర దుశ్శకునము లెన్నియో కానవచ్చుచున్నవికదా! మేఘములు లేకయే వర్షములు కురియుటయు భూకంపము కలుగుటయు నివి మంచి శకునములందురా? మఱియుఁ గొన్నిదినములనుండి తోకచుక్కయొకటి తూర్పుదిక్కునఁ గనఁబడుచున్నదికదా! ఇవన్నియు వట్టి బూటకము లనఁజెల్లునా?

చ. పలుకులు వేయునేటికిక ప్రాణపతీ! వినుఘూకనాదముల్।
పలుమఱు భీతిదంబులగు స్వప్నములుండగ ధూమకేతువుల్।
చలనమునొందు ధాత్రియును శ్యామలమేఘ విహీనవర్షముల్।
దలపక్షీ తీశులం గలచుఁ దక్కినవారిని గష్టపెట్టనే॥

నాథా—మీరు భీతిచెందరని యందఱకును విదితమే. కాని యబలలమగు మేము భయపడుట సహజమేకదా. మా భయనివారణార్థమైనను మాచెంత నుండవలదా?

ప్రశస్థ—భూవరా! మీరీరాణిగారి పలుకుల నాదరింపవలయును.

ఉచ్ఛ—కానిమ్ము. మీరింత యేల పట్టి పెనఁగవలయును? ఈ దినము గృహమందే యుండెదను.

బిజ్జల— మహాప్రసాదము. నానాథునికి నాపై యనురాగము తగ్గ లేదనుట కిదియే తార్కాణ.

తెజ—మహారాజుగారు నేడు కొలువుకూటమందు దివ్య సింహాసన మలంకరింపరా? బిజ్జలరాణి గారికి మంచి స్వప్నములు

కలుగువఱకు తాము భవనమందే యుండ నిశ్చయించి నా రా?

ఉచ్ఛ—నీ కెందులకీ యధిక ప్రసంగములు? రాజకార్యములన్నియు నిచ్చటనే నిర్వహింపఁ బడును. అర్ధరాత్రమందైనను న్యాయముగోరువారు నన్ను జూడవచ్చును. మీరింక మీ మీ గేహముల కరుగుడు.

తేజ—
ప్రశస్థ— } చిత్తము. చిత్తము.(నమస్కరింతురు

(నిష్క్రమించుదురు.)



# చ తు ర్థ ర్ం గ ము

భోగసేనుఁడు:—

(స్వగతము)

ఉ. ,, రాజలక్షూరుఁడయ్యెఁ బరిరక్షకు లెవ్వరు మాకునింక, వి
భ్రాజితభోగసేన! యిక భ్రాంతిని వీడుమ'' టంచు నెందఱో
పూజితులైనవారు తగుబోధలఁ జేసిరి నాకుఁ గానియే
వ్యాజముచేతనైన నరపాలునిజంపుట కిచ్ఛగింపఁగా.

నన్నవమానించిన మాత్రానే నీయుద్యమమునఁ జేరుట పాడియా? ప్రతికార్యమందును నీ భూపాలుఁడు నా యభిప్రాయమును గోరుచుండెడివాఁడు. నావిషయ మటుండనీ. ఈ ధాత్రీశ్వరుఁడు కాశ్మీరమం దనేక శాశ్వత కార్యములఁ జేసి తనపేరును యుగాంతమువఱకు స్థాపించికొనెను. ధైర్యస్థైర్యాదులం దీతనితోఁ దులదూగు వసుధాధిపుఁడే లేఁడనితోచెడి. అగ్నిదగ్ధంబైన నందికేశ్వర పురమును బునర్నిర్మాణంబు గావించి చక్రధర, యోగీశ, స్వయంభూప్రభృతి దేవతా యతనంబుల స్థాపించి వంద్యుఁడయ్యెను. ఈతని న్యాయ విచక్షణ యావర్తకధనిక సంవాదమును యుక్తితోఁ దీర్మానించుటచేఁ గననయ్యెను. ఈతని యౌదార్య గాంభీర్యగుణములు దనపై దాడివెడలి సమరము చేసిన సోదరుని క్షమించి మరలచేరఁదీసిన విషయమే చాటుచున్నది.........ఏమీ. నాయీయవస్థ. ఇంతవఱకుచ్ఛలుఁడు దుష్టుడనియెంచి శ్రద్ధా సేనాదులకు సాయపడునట్లు మాట యిచ్చితినిగదా. వీరిచర్యలు నిష్కారణముగాఁ బ్రారంభించియుండవు. ఎద్దియో కారణముండును. ఉద్యోగు లందఱీభూపతిని సహింపరు. ప్రజల విషయమో......ఈ రాజు నసహ్యముతో భావించుటకునాకం

పఁబడిన లేఖలే నిదర్శనములు. వేయేల. ఈభూపతి ప్రభుత్వబలముచే మారిపోయినట్లు దృఢమయ్యెడి. ఇంకను విశేషముగా నిరంకుశత్వమును వహింపఁగలఁడు......— సూర్యభగవానుఁడు పశ్చిమాశాంగనా గృహమునకు రాగయుక్తుడై వేవేగఁ జేరఁబోవుచున్నాడు. ఆదిక్కునందుండు అరబీ బీబీలఁజూచి కాఁబోలు నీబింబముకూడ తన ముఖముపై బురఖావైచికొనెను.

ఉ. కలకలముల్ శమించె నలకౌటుక చీఁకటిమించె, నింతలోఁ
జెలతెలమోముతోడఁ జనుదెంచెడు చంద్రముడుత్పలంబులున్
గలకలనవ్వనోయన వికాసముసెందెడువేళయయ్యె, ను
చ్ఛలపలియంత మొంది యిక కాంతిలుకొలమువచ్చెఁ జెచ్చెరన్.

మాయాదేవి పురుషునిలో లీనమైన విధమీ యామవతియు సోముకరంబులఁ జిక్కి మాయమగుచున్నది. ఇంక జాగేల?

తే. గీ. దివసమంత మొంచెఁ దుదకుఁదేజముడిగి
యుచ్ఛలా! నీమజీవనముర్వినుండి
పయనమయ్యెడినింతలోఁ బరముఁజూడ
నాయువుండిన రక్షణఁజేయఁబూను.

అస్మదీయ మిత్రులు నాకొఱకై నిరీక్షించుచుందురు. శీఘ్రముగా నాపనిని ముగించి చింతల మానుకొనెదను.

(విష్కంభము)



# ఉచ్ఛల విషాదము

## చతుర్థాంకము

—○—

### ప్రథమ రంగము.

——

(స్థలము—భవనాంగనము)

(ఉచ్ఛలుఁడు, సుజనాకరుఁడు, రైవతుఁడు.)

ఉచ్ఛ—సుజనాకర, ఏదీ ఖడ్గమిటు తెమ్ము. పరీక్షించెదముగాక.

సుజ—ఏలినవారి యాజ్ఞ— (ఖడ్గమందిచ్చును)

ఉచ్ఛ—(ఖడ్గము నొఱనుండి లాగిచూచి) ఓయీ, ఇది సానదీరిన కత్తియే గదా?

సుజ—చిత్తము. దానిధార చాల తీక్ష్ణముగానున్నది.

ఉచ్ఛ—(ఖడ్గమందికొని) ఖడ్గమా! నీ శక్తి ముల్లోకములందును నసమానమై యున్నది.

సీ. సర్వకాలములందు సజ్జనహింసను
జేయు దుష్టులను శిక్షించినావు
ఋషిపుంగవులచేత నేపుమైనెగడిన
స్మృతులను జాల రక్షించినావు

పార్థివేంద్రుల బలాబలములఁ బరికించి
జయలక్ష్మివారి కొసంగినావు
సపురంబులందు భేదములఁ జాటింపక
యుర్వికి భారంబు నడిపినావు

తే. గీ. తోడుపడినావు వీరుల తుష్టిగాఁగ
జేకరిచినావు మాన్యత క్షితిపతులకు
నేలినావు జగంబుల నెదురులేక
ఖడ్గమా! నీదు శక్తి విఖ్యాతమిలను.

ఉచ్ఛ—సుజనాకర—

సుజ—దేవా!

ఉచ్ఛ—ఈఖడ్గమును బట్టికొని యెల్లప్పుడును నాచెంతనే యుండ వలయునుసుమా

సుజ—(ఖడ్గమందికొని) చిత్తము. దేవర వారిదివఱకే యీ మీచరణసేవకుని విశ్వాసమును బాగుగా నెఱిఁగినవారు. ఇఁకముందును నెఱుఁగఁగలుగుదురు.

(లోపల ధ్వనియగును)

ఉచ్ఛ—సుజనాకర, అదేమో ద్వారముకడ నెవ్వరో వేచియుం డినట్లున్నది. కనుఁగొనిరమ్ము

సుజ—చిత్తము. (నిష్క్రమించును)

ఉచ్ఛ—(స్వగతము) నిన్నటిరేయి యిదే సమయమందేకదా బిజ్జల కలవరించుచుండినది. దాని కెన్నఁడునులేని యాపిచ్చి, యాపట్టుదల యాశ్చర్య జనకముగానున్నది. ఇట్టి స్వప్నములు లోకములో నెందఱకు సంభవింపవు? ఇవి సాధారణాంశములే, అయినను బిజ్జల వీనిని గొండంత చేసెనుగదా. ఆదేవి నేఁడును గలవరించుచుండ నోపు... ......నేఁడేలయో నా యుత్సాహాగ్ని యంతయుఁ జల్లా రినట్లున్నది. దీనికి బిజ్జలయే కారణ భూతురాలు.

(కాంచను ముందరిగి -- రైవతునితో)

రైవతకా—ఏదీ దీపమింటుపట్టుము. (రైవతుఁడు ముందునకు వచ్చును) బాలకా, పల యీదీపము తేజోహీనమై యున్నది.

రైవత-స్వామీ. దీపమునందే లోపమునులేదు.

ఉచ్ఛ—ఓరీ, ఎంతప్రొద్దయి యుండవచ్చును.

రైవత-స్వామీ. నగరులో నందఱును నిద్రించియుందురు.

ఉచ్ఛ—బాలకా, నీకును నిద్రవచ్చుచున్నది కాఁబోలు. నీవయసుబాలురందఱు నింతవఱకే యొకనిద్ర తీసియుందురు. కుమారా, ఎక్కుడుకాలము మేలుకొనిన నీశరీర మస్వస్థత చెందును సుమా. దీపము నిదిగో నీ దిమ్మెపై నుంచిపోయి నిద్రామాతయొక్క తొడలపైఁ గనులు మూసికొని ప్రపంచమును గొంతసేపు మఱచిపొమ్ము.

రైవ—స్వామీ. నేను నాకింకను నిద్ర రాకున్నది. మీరు విశ్రమించిన పిమ్మటనే నేనును విశ్రమింపఁగలను.

ఉచ్ఛ—(స్వగ) బాల్యదశ మానవుని జీవితములో నెల్ల యమూల్యమైనది.

తే.గీ. నిర్మలాంతరంగంబుచే నెగడియుండి
కామలోభాది రిక్తుడై క్రాలియుండి
బాలురీలని నెవ్వాఁడు భవ్యుఁడగును
వాఁడెపో ధన్యుఁడును బూజ్యుఁడీడితుండు.

[తేజుఁడును. సుజనాకరుఁడును గనుపింతురు]

తేజు—(అపవారితముగ) సుజనాకర, రాజుగారిచెంత నా లెక్కకురాని బుడుతఁడుతప్ప నింకెవ్వరును లేరుగదా.

సుజ—(అప) స్వస్థ చిత్తులైయున్నారు. రాజుగారికి సహాయమైన నింక యీ మూర్ఖుఁడగు బాలుఁడొక్కఁడే!

తేజ—(అప) ఈద్వారము నిటులే తెఱచియుంచుము. మనమి త్రులందఱును సునాయాసముగా రాఁగలుగుదురు.

సుజ—(అప) మంచిది. నీవిందేయుండుము. రాజుగారికి నీరాకఁ దెలిపివచ్చెదను———(మందరిగి————(రాజుతో) మహాప్రభో. తేజుఁడు మీతో నొక ముఖ్యకార్య విష యమై ప్రార్థింప వచ్చితినని చెప్పుచున్నాడు. ఇప్పుడు సమయముకాదన్నను దొందఱ చేయుచున్నాడు. నేను వలదన్నను లోపలఁ బ్రవేశించి—ఇదిగో రానేవచ్చెను. (తేజుఁడు సమీపించును)

ఉచ్ఛ—ప్రజల కష్టసుఖముల నరయుటయే నా ముఖ్యకార్యము. ఏ సమయమైననేమి. తేజా—ఏమి నీయుదంతము. తెలుపుము.

తేజ—మహాప్రభో! యీ వినతిపత్రమును చిత్తగింపుడు. తర్వాత మనవి చేసికొందును,

[రాజు పత్రమును జదువుచుండును. భోగసేనుడు ప్రవేశించును]

భోగ—(స్వగతము) ఆహా! ఇదేమి. ఈరాజును జూచినవెంటనే నామనస్సు చెదరిపోవుచున్నది. నేనీతనివధకు సాయప డుట ధర్మమో కాదో యా పరమేశ్వరునికే యెఱుక. మా శ్రద్ధా సేనాదు లనుకొనునంతటి దుష్టుఁడా యీ యుచ్ఛలరాజు ఒకవేళ దుష్టుఁడైనను నీరాజు నిన్న మొన్న టివరకునన్నత్యంతముగాఁ బ్రేమించుచుండెడివాఁడు.ఇత నికెవ్వరో నావిషయమై దుర్బోధలుచేసి యుందురు. ఇంత మాత్రముననేయీయుద్యమమునఁ జేరుటభావ్యముకాదని నాయంతరాత్మ బోధించుచున్నది. మఱియు నే కారణ మువనో యేమో, ఇతనిపై నాకు జాలి కలుగుచున్నది. ఏమైనఁగానీ మా రహస్యము నీతనికి వెల్లడించి రక్షించె దను. తర్వాత నేమైనను సరియే!

(సమీపించి ప్రకాశముగా)

మహీపాల; నాదొకమనవి కలదు. తామవశ్యము చిత్త గింపఁ బ్రార్థితులు.

ఉచ్ఛ—నీ యుద్యోగ విషయమై వేడుకొన నెంచితివా?

భోగ—నావిషయముకాదు. తమకు లాభకారిగనైన విషయమే నివేదింపఁ గోరుచున్నాను.

ఉచ్ఛ—మొంటట తేజుఁడువచ్చెను. ఇతని విషయమై చర్చించిన పిమ్మట నీయుదంతమేమో కనుఁగొందును గాక—తేజ. నీవిజ్ఞాపనమును జూచితిని. నీసంగతియేమో చెప్పుము.

భోగ—(స్వగ) ఆహా! అదృష్టహీనులకెట్టి తలంపులే యుండనోపు. ద్వారముకడ నుండువారు వచ్చినప్పుడుకదా యితడు పశ్చాత్తప్తుడగును.

తేజ—భూవరా, జనకచంద్రునిజంపి దేశమునుండి వెడలిపోయిన నా యాప్త బంధువగు తిలకుఁడు మీ పూర్వాజ్ఞచే నిన్న చారులచేతఁ బట్టువడెను. ఆతని మీరు రేపు శిక్షింపవ చ్చును. హర్షరాజు పైగల ప్రీతిచేతఁ దిలకుఁ డిట్లొనరిం చెనేకాని వేరుకాదు. అతఁడిప్పుడు పశ్చాత్తాపము చెంది సవాఁడై మీకు విశ్వాస పాత్రుఁడగు భటుఁడుగా నుండఁ గోరుచున్నాడు.

ఉచ్ఛ—తిలకుఁడు విశ్వాసయోగ్యుఁడు కాఁడు. మాచే నిప్పుడు చిక్కినందులకు సంతోషమయ్యె. ఇతరులందఱు చూచి భీతిల్లునట్లుగా వానిని శిక్షింతును.

తేజ—మానవేంద్ర! తిలకుఁడు కోపావేశమునఁ జేయఁగూడని దౌష్ట్య మొనరించినది సత్యమే. కాని యదియుద్ధ ధర్మ మని యెన్నవలెను. తాము కరుణింపకున్న నింకెవ్వరితో మొఱ పెట్టుకొన వలయును.

ఉచ్ఛ.—నీవు వామనమూర్తివై వేడినను నేను వినను. సత్పురుషులఁ గ్రూరముగాఁ జంపవచ్చునుగాని తత్ఫల మనుభవింపరాదా? శత్రువులను శూలారోపణము సేయుటయు యుద్ధ ధర్మము సుమా.

తేజ—మహీపాలా! ఈ తిలకుఁడు నా మేనత్తకొడుకు. తల్లికొకఁడే పుత్రుఁడు. మఱియు బ్రాహ్మణుఁడు. కావునఁ దామెట్లైనను గనికరింప వలయును. బ్రాహ్మణుఁడు ఘోర పాతకి యైనను అవధ్యుఁడని శాస్త్రములన్నియు ఘోషించుచున్నవి.

ఉచ్ఛ—దుష్కార్య మెపుడు చేసెనో యప్పుడే యతని బ్రాహ్మణ్యము తొలఁగి పోయినది. కావున సామాన్యాపరాధుల వలెనే యతఁడు శిక్షింపఁబడును.

తేజ—నాకొఱకైనను వానిని మన్నించి విడిచిపెట్టుడు. మీకు నిరంతర కృతజ్ఞుఁడనై యుండెదను.

ఉచ్ఛ—దురాత్మా! నీవు తుచ్ఛుఁడవై దుర్మార్గులను బ్రోత్సహించువాడవగుటయే కాక యట్టి దుష్టులను రక్షించి ధర్మధ్వంసకుఁడనని దుష్కీర్తికి బాలగుటకైనన్ను బ్రోత్సహించెదవా?

శా. ఓరీ! దుష్టగుణాత్మ! దుర్మతి! వివాదోత్సాహయుక్తుండవై
క్రూరాత్ముం దిలకుం క్షమింపుమను నీ ప్రోత్సాహముల్ వ్యర్థమే
మేరూర్వీ ధరశృంగ భాగమును భస్మీభూతముం జేసినన్
వారింపంగలవే మదీప్సితము నీ వాగ్వాద చిత్రంబుచే.

నీ వెంత ప్రార్థించినను ఫలములేదు.

తేజ—రాజుగారెంత కోపించినను ప్రజలు మఱియు మఱియు వేడుదురుగాని మానుకొందురా?

క. కసరినఁ గొట్టినఁ దిట్టిన
విసువక సుతులాత్మ మాత బీడించు విధిఁ
వసుధాపతి కోపించిన
పౌరులుగంగా వేడుచుంద్రు భూజనులర్థిఁ.

ఉచ్ఛల మహీపాలా, వాని నిర్ధనునిగా జేయుఁడు. లేదా కొంతకాలము కారాగృహమందుంచుఁడు. కాని వాని ప్రాణములు మాత్రము తీయ నియోగింప వలదు.

ఉచ్ఛ—ఏమీ? యీహిమాచలమునుఁ గదలింప శక్యమా నీకు?

గీ. దుర్మద ధ్వంసమునకు నుత్సుకత నొందు
మన్మనో నిశ్చయము ద్రిప్ప మనుజుఁ డరయ
ఏ హిమాలయోత్తుంగ మహీధ్రమందు
మంచు నమ్మంగఁ జూచెడి మందబుద్ధి.

తేజ—అయ్యా, ఎట్లైనను వానిని రక్షింప వలయును. భోగ సేనా, మీరైనను నాకు సాయపడరా?

భోగ—రాజచంద్రా! శరణుజొచ్చిన వారిని రక్షించుట క్షత్రియోచిత ధర్మము. ప్రత్యేకముగా నీ విషయమున మీరు దూరదృష్టితో మన్నించుట యుత్తమమని నా యభిప్రాయము.

ఉచ్ఛ—అపరాధులకుఁగూడ నభయమిచ్చిన న్యాయ మెట్లు సాగునో నీవే చూపింపుము.

భోగ—రాజచంద్ర, ఈతని విషయమునఁ గరుణజూపుట మీకు శ్రేయస్కరము.

ఉచ్ఛ—భోగసేనా, బహుకాలము నుండి న్యాయాన్యాయముల విమర్శించిన నీలో నిట్టి వైపరీత్యము నేఁడు చూడనయ్యె. చిత్రము, కడుఁజిత్రము!

తేజ—అయ్యో, నా ప్రార్థన లీ రాజు హృదయమున నాటికొనం జాలవయ్యెనే! ఏమిచేయుదును?

(హంసరథుండు, శ్రద్ధాసేనుండును ప్రవేశింతురు)

హంస—(ఉచ్ఛలుని వీపున ఖడ్గముతోఁబొడిచి) ఇదిగో! నాఖడ్గ మిందు నాటికొనెను. తేజా! ఇట్టి పద్ధతులచేతనే నిట్టివారు వశీకృతులగుదురు. కాని మంత్రములకు మామిడికాయలు రాలునా?

ఉచ్ఛ—హా! ద్రోహము! ద్రోహము! సుజనాకర! ఖడ్గము ఖడ్గము

(సుజనాకరుండు కత్తి చంకబెట్టికొని పారిపోవును. చూడాసేన ప్రయాగభూత భిక్షులు ప్రవేశింతురు)

నీచా, ఎంతపని చేసితివిరా?

గీ. తలుపుఁ బడినట్టి శ్వాన విధంబు నొప్పి
వాలమును దాచి పందవై పాఱెదేల?

అయ్యో, కుక్కచావు చావవలసి వచ్చెను.

శ్రద్ధ—(ప్రక్కఁబొడిచి) అటులే చావుము. నీ చావుచే దేశశాంతియైనఁ గలుగును.

[ఉచ్ఛలుండు నడుమునుండు ఛురికనులాగి హంసరథుని బొడుచును. హంసరథుండు చచ్చిపడును.]

ఉచ్ఛ—ఓరీ శ్రద్ధాసేనహతకా! నీ వీద్రోహాండము నెన్ని దినములనుండి పొదిగించితివిరా? పందా! చేత ఖడ్గముండిన నీశరీరము నిప్పుడే తుంటలుచేసి యుందునే!

[అని వానిపైబడును] (చూడాసేనాదులు శ్రద్ధాసేనునికి సాయపడుదురు)

శ్రద్ధా—(తప్పించుకొని) ఈ వరాహ మింతమాత్రముతోఁ గూలదు. మిత్రులారా! అందఱును నొక్కపెట్టున నీతనిపైఁబడి వధింపుడు.

[ అందఱును జుట్టుకొందురు. భోగసేనుఁడు తిరస్కృతుఁడై యూరకుండును]

ఉచ్ఛ—భోగసేనా! భోగసేనా! ఆహా; పలుకఁడు?

గీ. సజ్జనుఁడు భోగసేనుఁడు సహిత మకట!
సాహసించెను నాపైన ద్రోహియగుచు.

భోగసేనుఁడుకూడ నాకుఁబ్రతికూలుఁడై వచ్చెనుగా! ఇంక నేనేల పైనఁగవలయును?

శ్రద్ధా—స్నేహితులారా! పొడువుడు., పొడువుడు.

[అందఱును పొడుతురు]

ఉచ్ఛ—హా! శంకరా! శంకరా! (మృతించును)

శైవ—అయ్యో, అయ్యో, మా స్వామిని జంపిరే! ఓరీ శ్రద్ధాసేనా, నీవెట్లు బ్రతికెదవో చూచెదను!

[తన చేతనుండు దీపముతో గొట్టును. ఉచ్ఛలునిపైబడి యేడ్చును]

శ్రద్ధా—(దెబ్బతిని) కుక్కుటకిశోరమా, ఏమిది నీకొక్కకొనాదము? నీ శ్రమకై యిదిగో యీ బహుమానము గొనుము.

[పొడుచును]

శైవ—అబ్బా, చచ్చితి, చచ్చితి.

[ఉచ్ఛలునిపైఁబడి మరణించును]

భోగ—ఛీ, ఛీ, దురాత్మ, శ్రద్ధాసేనా! ఘోరము. మహాఘోరము. నేను మొదలే తెల్పలేదా యితరులను హింసింపఁగూడదని, అయ్యో పాపమీ బాలుఁడు విశ్వాసమునకై సమర్పించిన ప్రాణ మెంతవిలువ గల్గినది?

ఇంక నే నిందుండఁ జనదు. (నిష్క్ర)

శ్రద్ధా—పోనిమ్ము. ఇప్పుడేమి చింతనాకు?

———

## ద్వితీయరంగము



[ప్రశస్థకలశుఁడు, గర్గచంద్రుఁడు ప్రవేశింతురు]

గర్గ—అయ్యో! ప్రశస్థకలశా! ఇంకేదిగతి. సైన్యాధిపత్యము ను వహించియుఁ బిఱికి పందలగు నీ ద్రోహులు మన రాజును జంపుటను నిరాకరింపఁజాలక పోయితినే!

గీ. తళ తళ మెఱయు కత్తులు ధారణీశు
తనువు దూరెను గరుణ యింతయును లేక
మేరుపర్వత బిలములఁ జేరఁ బోవు
క్రూర సర్పంబులను బోలి ఘోరమగుచు.

ప్రశస్థ—ఓయి, ఇది విలపించుటకు సమయముకాదు. ముందు కార్యాలోచన చేయుదము.

గర్గ—ఆయ్యో, ఎంత ప్రయత్నించినను దుఃఖము నాపఁజాలనే. ఇట్టి ప్రజాహిత చింతకుఁడగు రాజును మరల నెన్నివిధ ములనైనఁ బడయఁగలమా?

గీ. పవలు రాత్రియుఁ గష్టించెఁ బ్రజల కొఱకె
కోరుచుండెను నేవేళ వారి హితము
దండనార్హుల శిక్షించె ధర్మ మరసి
యిట్టి పుణ్యాత్ము మరణంబు నెట్టులోర్తు.

ప్రశ—ఊరడిల్లుము, గర్గచంద్రా ఊరడిల్లుము. మిత్రమా! మన మిద్దరమే యుచ్చలరాజునకు విశ్వాస పాత్రులముగా నుం డువారము. మన మిప్పుడు వ్యసనమందే మునిగియుండిన కార్యము చెడిపోవును. అరాజకమైనదని సైన్యముద్రోహు లవశమగునేమొ? మఱియు నీద్రోహులు దౌర్జన్యములను విశేషముగాఁజేయ మొదలిడుదురు. మనము తగురీతి నా యిత్తమై యుండవలయును.

గర్గ—నిశ్చయము. నిశ్చయము. మనము జాగ్రత్తగా మెలఁగ వలయును.

ప్రశ—సుస్సల భూపాలునికిఁ దక్షణమే జాబువ్రాసిపంపుటమేలు.

గర్గ—సుస్సలరాజును దక్షణమే సైన్యయుక్తముగా బయలుదేరి రమ్మని జాబువ్రాయుదు.

ప్రశ—అట్లే చేయుదును. అతని సహాయమున నీ ద్రోహుల సందడను నాశన మొనరింప వలయును.

గర్గ—ఆపని నేనే చేయుదును. ఈద్రోహులను నిశ్శేషముగా ధ్వంసము చేయువరకు నాకుఁ దృప్తియుండదు.

ప్రశ—అట్లైనఁ జాలసంతోషము. నీవును సుస్సలరాజు వచ్చులో పల సైన్యముల నాయితము చేయుము. ఉచ్ఛలరాజు శరీరమునకు దహన సంస్కారములు చేయవలయును. ప్రొద్దుపోవునేమొ?

గర్గ—చితి సిద్ధమైయుండెను. బిజ్జలదేవి దుఃఖతరంగముల దొర్లు చుండెను. ఆచార పద్ధతి నీరాజుభార్య సహగమన మొన ర్చును.

ప్రశ—ఈ ద్రోహులు డామరుల ననేకులఁ దమపక్షమున జేర్చు చున్నారని వినుచున్నాను. కావున సైన్యమును సిద్ధపఱచి రెండు మూఁడు దినములలోపలనే వీరి నందఱను వేటాడి చిక్కిన వారిని వ్యాఘ్రాదుల బోనులలో నుంచునట్లు సుస్స లరాజు వచ్చువరకు బంధించియుంచుము.

గర్గ—అటులే చేయుదును. మీరు సుస్సల రాజునకు వార్తనం పుడు. నేనిపుడే దహన సంస్కారములను బూర్తిచేయించి వచ్చెదను.

[నిష్క్రమింతురు]

## తృ తీ య ర ం గ ము

[ప్రవేశము— బిజ్జలదేవి చెలికత్తెలు]

బిజ్జల—అయ్యో! అయ్యో! రాత్రింబవళ్లును బ్రజల ప్రాణములఁ దన ప్రాణములనఁగఁ గాపాడినందులకా యీఫలము. దుర్భరము. ఈతాప మత్యంత దుర్భరము.

చెలు—అమ్మా, ఊరడిల్లుము, ఊరడిల్లుము.

బిజ్జల— సు గ ం ధి

ఏరికైనగాని హింస నెప్పుడైనఁ జేయఁడే
ధీరులైనవారిఁ జేరఁదీయుచుండు వాఁడయో
ఘారుణీశు నిట్లుతీక్ష్ణధారల న్నశింపఁగాఁ
గ్రూరులై వధింప నేవిరోధ కారణం బొకో.

చండ భుజాదండ శక్తిచే సకలోర్వీ మండలంబు జయింపఁ గల్గియు, సమస్త రాజన్య సైన్యముల నోడింపఁగల్గిన చతురంగ బలముండియు, గర్గచంద్ర ప్రశస్తకలశులవంటి మంత్రుల సాహాయ్యంబుండియుఁ, బ్రభుభక్తిపరాయణులైన ప్రజలుండియు, దుర్భేద్యరహస్య పరిశోధనచతురమతులగు చారులుండియు, నా నాథుఁడు నాకు దక్కకపోయెనే! ఈ ద్రోహులిట్టి ఘోరకార్య మొనర్చుట కెన్నినోములు నోచిరో? అయ్యో, ఇంకనాబ్రతు కేల?

[గర్గచంద్రుఁడు ప్రవేశించును]

గర్గచంద్రా, నీవైన నా పతిని రక్షింపక పోయితివే.

గర్గ—అమ్మా! విధిబలీయము నెవ్వరు మార్పఁగలరు. మీరిట్లల మిక్కుటముగా శోకించెదరు? చేజారిన పనుల కత్యంతముగా విలపించిన దుఃఖమున కంతమే యుండదుకదా!

బిజ్జ—సేనాపతీ! ఏమిచేయుదును? చెలులార, మీరును ననాథలైతిరికదా?

సీ. ప్రాణనాథుఁడిటు మరణంబు నొందు నటంచుఁ
గలనైన నొకసారి తలపనైతి
దయమాలి ద్రోహులే ధవుని జంపుదు రటంచుఁ
గలనైన నొకసారి తలఁపనైతి
యౌవన దశయందె యార్తిగుందెదనంచు
గలనైన నొకసారి తలపనైతి
ధాత్రి నిట్టి విపరీతములు జరుగునంచుఁ
గలనైన నొకసారి తలపనైతి

గీ. నాథుఁడరిగిన పిమ్మట నాకుఁ బ్రదుక
నిష్టమేమియు లేదు సుమ్మింతులార
అతఁడు పోయిన మార్గమే యరుఁగ దలఁతు
కాన శోకింప నేలొకో కాంతలార,

చెలియొకతె—అమ్మా! ఇక మాకు దిక్కెవ్వరు? మే మికెవ్వరికి సేవఁజేయవలయును? మేమును బ్రదికియు ఫలములేదు.

బిజ్జల— చెలులార! అట్లు తలఁపకుఁడు. సుస్నలరాజుదేవి మిమ్ముల నవశ్యము నామారుగా బోషింపఁగలదు. సందేహములేదు. చెలియలార! నాకడసారి మాటలవినుడు.

సీ. చిన్ననాటను గోలెఁ జేసిన తప్పులఁ
గరుణతో మన్నించి కావరమ్మ
సత్కారమును జేయ జంకిన నెపుడైనఁ
గరుణతో మన్నించి కావరమ్మ
కినుకతో నెపుడైనఁ గేరడంబాడిన
సదయులై మరవుడు సఖియలార

* గీ. కరుణయుంచుఁడు నాయందుఁ గాంతలార
అంగము లధికబలహీనమయ్యె సుమ్మ
ఉచ్ఛలాధిపు వీడక యిచ్ఛతోడఁ
బరమునందును గూడుదుఁ బ్రాణపతిని.

---

* గర్వించి యెపుడైనఁ గాఠిన్యమూనిన సదయులై మఱవుఁడు సఖియలార.!

బిజ్జ—గర్గచంద్రా! నేను సిద్ధముగానున్నదానను. నేనేల యింతగా దుఃఖింపవలెను. నానాథుని బాసియుండినగదా నాకు వ్యసనము. ఓయగ్నిదేవా, సమస్తవస్తువులఁ బరిశుద్ధిచేసి యీనావ్యసనము నేఁడు పోనడఁచువాఁడవుకదా. నీవెంత సహాయకారివి?

సీ. వేదకాలమునాఁడు ద్విజులకు సురలకు
రాయబారిగనుండి క్రాలినావు
శాస్త్రకాలమునాఁడు సకల కర్మలకును
సాక్షివై దీప్తితో నలరినావు
చారిత్రకమునాఁడు సహగమనేచ్ఛతా
విధవల వ్యథల మాన్పించినావు
సర్వకాలములందు సద్గృహస్థులాసంగు
సేవలనందుచుఁ జెలఁగినావు

గీ. ఆధునిక కాలమున పిశాచాత్ములగుచు
హైందవ స్త్రీలఁ జెఱుప నహంకరించు
వారినుండి యబలలఁ గాపాడినావు
పావకా! పరబ్రహ్మాత్మ! ప్రణతిఁ గొనుము.

ఓ పరబ్రహ్మస్వరూపా! అగ్నిదేవా! నీ శరణు జొచ్చుచు చున్నదానను గర్గచంద్రా, నాప్రాణేశ్వరునికి నీవును, ప్రశస్తకలశుఁడును విశ్వాసపాత్రులును, నాప్తులునునైన వారు. నాకడసారి యభీప్సితమొకటికలదు. అది తీర్చెదవేనిఁ దెలుపుదును.

గర్గ—అమ్మా, ఉచ్ఛలమహారాజుగారి శాసనములరీతిఁ దమయాజ్ఞలను శిరసావహించువాఁడ. తామెట్టి దుస్సాధ్యమగుఁ గార్యములఁజూపినను సాధించువాడ.

బిజ్జ—అట్లైనవినుము. నానాథుని మోసగించి వధించినట్టి ద్రోహులందఱను నిశ్శేషముగా ఖండింపవలయును. అటుచే

యకపోయితివేని మాకుఁ బరమందును శాంతియుండదు. వారినందఱను బరిమార్చుటయే మాయాత్మకు శాంతిక్రియయగును. మఱియు సుస్సలరాజుతో నిట్లుచెప్పవలయును. "మీరు తమయగ్రజన్మునిపై నిష్కారణముగా దాడివెడలి యుద్ధముచేసి యోడిపోయియుంటిరి. కాని మీయగ్రజుడు భ్రాతృవాత్సల్యముచే మిమ్ము మన్నించెను. వంశోద్ధారకులిక మీరేకావున మీయన్నగారి యాత్మకుఁ దృప్తి కలిగింపవలయునని కోరితిరేని మీరు ద్రోహులఁబరిమార్చి వారిరక్తముచే మాకుఁ దర్పణముచేయవలయును. లేకున్న మీరు తత్ఫల ముభయలోకములం దనుభవింపఁగలరు." గర్గచంద్రా, యీమాటలు నీవు సుస్సలరాజుతోఁ జెప్పుము.

గర్గ—అమ్మా, తామనుజ్ఞయిచ్చినట్లు తప్పకయాచరించువాఁడ. నాకెన్ని కష్టములువచ్చినను, నా ద్రోహహాతకులందఱను జంపి మీయాత్మకు శాంతిగలిగింతును. ఇది తథ్యముఁ తథ్యము.

బిజ్జ—ఇప్పుడుగదా నేను శాంతాత్మతో సహగమన మొనర్తును. గర్గచంద్రా, సర్వేశ్వరుఁడు నీకుసకలకల్యాణములు చేకూర్చుగాత! చెలియలార, జంగేల కడసారి నావెంట చితివఱకురండు.

(నిష్క్రమింతురు)

గర్గ—(స్వగతము) ఆహా! కాలవిపర్యయ మెంతని చెప్పవలయును? విధియెంత బలీయమైనదోకదా! ఎట్టివారినెంతలోనే టులమార్చెను! ఈ బిజ్జలదేవియొక్క కళకళలాడు ముఖమునేడెట్లు వాడిపోయెను!

గీ॥ సౌరభం బెగఁజిమ్ము గొజ్జంగిపూవు
నఖవిలూనమై కళఁదక్కి నవయుమాడ్కి

ఉచ్ఛలాధిపుదేవేరి యున్నదకట!
కాలమా! నీకు నెమరింపఁ గలదు జగతి?

రెండుదినములకుఁ బూర్వముండిన యీరాణి యింతలో నెట్లు మారిపోయెను?

గీ. అంతఃపురమున వసియించు నతివ యిపుడు
వీథులందు దుఃఖించుచు వెడలవలసె
సూనతల్పంబులందుండు సుందరాంగి
కాటిలో నగ్నిలోఁబడి కాలవలసె.

ఓ సకల దేవతలారా! ఈ భూపాలుని భార్యాసహితం బుగ మీ స్వర్గమున సౌఖ్యమునిచ్చి రక్షింపుడు.

[నిష్క్రమించును]





# ఉచ్ఛల విషాదము



## పంచమాంకము



### ప్రథమ రంగము



స్థలము శ్రీనగరము— భోగసేనుని గృహము

(శ్రద్ధాసేనుఁడు, భోగసేనుఁడు మాట్లాడుచుండిరి)

శ్రద్ధా—మిత్రమా క్షమింపుము, క్షమింపుము. కోపావేశమున నాకేమియుఁ దెలియక యాబాలుని జంపితిని. నేను బాల ఘాతకుఁడను, క్రూరుఁడను, మహాపాతక పంక నిర్మగ్నుఁడను. నన్నుక్షమించి చేరదీయుమా నిను వేడికొందు.

భోగ—అయ్యో, ఊరక నన్ను బీడింపవలదు. నా యవివేకమునకు నన్నే నిందించికొనవలయును గాని నొకరినిదూఱ లాభములేదు.

ఉ. ఘోరపుఁగిల్బిషంబొదవెఁ గ్రూరుఁడనైతిని; నీకటంబునం
జేరితి ద్రోహవర్గమును, జేసితినయ్యయొ చేయరానియా
నేరము, గంటగంటకును నెమ్మదిఁదాపము హెచ్చుచుండె, నా
భూరవిఘూర్ణపద్ధించితిని భూర్యపకీర్తిఁ గడించితింగటా.

ఈ సంతాపము దుర్భరము, అత్యంత దుర్భరము!

శ్రద్ధా—భోగసేనా! ఏలమీరిట్లు విషాదయుక్తులై యున్నారు?

భోగ—అయినదానికి వగవనేల; కానిమ్ము. నాతో నీకింక యవసరములేదుకదా—ఊరకపొమ్ము.

శ్రద్ధా—అయ్యో, నిన్నింతవరకు నమ్మియుంటినే. నాలోపములను క్షమించి నన్ జేరదీయుటకై ప్రార్థించుచున్నాను. మఱియు

తే. గీ. గర్గచంద్రుఁడు గాల్చివ్రేఁ గదనమునకు
వచ్చుచున్నాఁడు సుస్వలపార్థివుండు
అడవి మెకములు దావాగ్ని పడి మునట్లు
పొలియఁగలవయ్య వీరిచేఁ బూర్ణముగను.

రంధ్రములనుండు మూషకములను బొగబెట్టి చంపునట్లు గృహముల లోపలనే వారు మనలనందఱను నాశనము చేయకమానరు.

కావున మనమూరకుండినఁ దప్పక నాశనమగుదుము.

భోగ—నీ తియ్యనిమాటలను విని బుద్ధిహీనతచే మోసపోయితిని. ఇంకేమైనను సరియే, నీతోఁ జేరియుండను.

శ్రద్ధా—మిత్రమా, యోజించుమా, నిను వేఁడికొనెదను. నీవెంత పశ్చాత్తాప పడినను వారు విడువరు. మఱియు మనమిప్పుడు తప్పేమి చేసితిమి! ఒక నిరంకుశ ప్రభువును, ప్రజాపీడకుఁడగు రాజును దొలఁగించుట తప్పని తెలిసియు నీవీ యుద్యమమునఁ జేరితివా? ఏల వృథా పరితాపము నొందెదవు.

భోగ—అయితే యిప్పుడు నావలన నీకేమి ప్రయోజనము?

శ్రద్ధా—మనమీ నగరమందుండుట శ్రేయస్కరముకాదు. తత్క్షణమే లోహర మార్గమందరిగి కొలఁది సైన్యముతో వచ్చు

సున్నల రాజును ఢాకవలయును. లేకున్న నాతఁడును, గర్గచంద్రుఁడును గలసిన మనము దక్కము.

భోగ—ఇప్పుడే చేసిన హత్య చాలదా? మరల సున్నలునిపై కూడ దాడి వెడలవలయునా?

శ్రద్ధా—ఎంత లౌకిక జ్ఞాన హీనుఁడవయ్యా నీవు. మనము సున్నలు నేమైన వధింపఁబోవు చున్నామా? ఆత్మ సంరక్షణ మును జేసికొందుము.

భోగ—నాకేమియుఁ దోచకున్నది. ప్రకృతము నీవు చెప్పినట్లే చేయుదును.

శ్రద్ధా—భోగసేనా! మన మిత్రులందఱు డామర సైన్యమును గూర్చుచున్నారు.

భోగ—మన మికజయమందుదుమనుట కల్ల.

శ్రద్ధా—జయాజయములు దైవాధీనములు. కాని పురుష ప్రయత్న మొక్కటి చేయుట యుక్తము. మఱియు శూలారోపణముచే హీనపుఁజావు చచ్చుటకు మారుగా యుద్ధరంగమందు దారుణ ఖడ్గ ఖండనముచే వీరమరణమొందుట మేలుకాదా? భోగసేనా! నీవిట్లు చింతించిన ఫలములేదు. వేరనుమానములమాని నావెంటనుండిన నీకెట్టి కష్టములును గలుగవు.

రమ్మారక నావెంట.

(నిష్క్రమింతురు).



## ద్వితీయరంగము

స్థలము—"ఆట్టాలిక" లోహరయొక్క ముఖ్యపట్టణము

సుస్సలుడు—(జాబును జేతఁబట్టి)

లేఖహారకా! ఎంతటి ఘోర దుర్భర విషాదమును గలిగించితివి. నేఁడెంతటి దుర్దినంబోకదా యిట్టి సంతాప జనక సమాచారమును వినుటకు. అయ్యో! కడసారి మా యన్నను జూచు భాగ్యము నాకబ్బకపోయెనే. నేనందుండిన ద్రోహులను జీల్చి చెండాడియుందును గదా! లేఖహారకా, తేజుఁడు రాజుగారితో వాదించుచుండెనంటివికదా?

లేఖ—అవును, స్వామీ, అతఁడే వాదించుచుండెను. హంసరథుఁడు, శ్రద్ధానేయుఁడు మున్నగువారు హఠాత్తుగాఁ బ్రవేశించి వెనుకనుండి రాజుగారిని బొడిచి చంపిరి.

సుస్స—(స్వ) ఆహా! ఆ తేజహతకుఁ డెంతపనిచేసెను. దినదినము విషమిచ్చిన వడపున నాచెవులలో ద్రోహవార్తల నించుచు నన్నా పరమ సజ్జనునిపై సమరంబు సేయునట్లు చేసి తుదకా భూపాలుని జంపెఁగా, ఆశ్రద్ధానేయుఁ డెంతటి దురభిమానియోకదా! నేను బ్రారంభముననే మాయన్నగారితో నా దుర్మార్గుని విషయమై చాల జాగ్రత్త సుమా యని మందలించితిని. కాని ఫలము లేకపోయెను. ఎట్టి సుగుణాకరుఁడు, ఎట్టి ప్రజానురంజకుఁడు, ఎట్టి లోకోత్తర పురుషుఁ డస్తమించెను. దుష్బుద్ధిచే నాయన్నయెడ నేను ద్రోహినై యుద్ధముజేసి పరాజితుఁడనైనను నన్ననుగ్రహించి క్షమించెనే యా యుదార గుణ భూషణుఁడకు నగ్రజుండు. అయ్యో! అయ్యో! ఎంత దుఃఖంచిన నేమి ఫలము:

(జాబును చూచి) ప్రశస్థకులశ్రుఁడేమి వ్రాయుచున్నాడు?
"బిజ్జలదేవిగారు సహగమనము జేయుచు తమ్మ కిట్లు తెలు
ప నాదేశించియున్నారు "మీరు తమ యగ్రజునిపై ని
ష్కారణముగా దాడివెడలి యుద్ధముచేసి యోడిపోయి
నను మీయగ్రజుఁడు భ్రాతృవాత్సల్యముచే మిమ్ము మన్నిం
చెను. వంశోద్ధారకులిక మీరే కావున నూ యాత్మలను
దృప్తి సేయఁ దలఁచిన ద్రోహు లందఱఁ బరిమార్చి వారి
రక్తముచే మాకుఁ దర్పణము లీయవలయును. లేకున్న
మీరు తత్ఫలము నుభయలోకము లందనుభవింపఁగలరు"
ఆహా! బిజ్జలదేవిగారి మాటలందెంతటి క్షాత్ర తేజము ప్ర
జ్వరిల్లుచున్నది. ఆదేవిగారి వాక్కులన్నియు భావగర్భిత
ములై సత్యములై యున్నవి. అమ్మా! బిజ్జలదేవీ! మీ
యాదేశమును శిరసావహించి మీరు కోరినట్లే మీకుఁ
దర్పణము లిడువాఁడను. (ప్రకాశముగా)

ఓరీ. ఏమంటివి. ఆసీచుడైన హంసరథుఁడా మొదట మా
యన్నగారిని బొడిచినది.

సేవ—అవును స్వామీ! అటుతర్వాత శ్రద్ధా సేనుఁడు మహారాజు
గారిని ప్రక్కలో నొకపోటు పొడిచెను. అంత చూడా సే
నుఁడు ప్రయాగుఁడు భూతభిక్షుఁడును మహారాజుగారిని
జుట్టికొని పొడిచి చంపిరి.

సుస్న—హా! యెంతటి ఘోరము! ఎంతటి ఘోరము. దీనికంత
యు మూల మూశ్రద్ధా సేన హతకుఁడేకాని యన్యులు కా
రు. వాని శిరమును నేను జేతులార ఖండింపకుండిన నా
దొక పౌరుషమా? ఓరీ భోగ సేనుఁడు కూడ నచ్చట యుం
డెనంటివే. అతడేమిచేసెనో అదియు వినుపింపుమా!

సేవ—దేవా! భోగసేనుఁడేమియుఁ జేయక లేక యూరక నిలుచుండి
యుండెనఁట. ఉచ్ఛల రాజుగారు భోగసేనుని సహాయార్థ
మై పిలిచిరఁట, కాని యతఁడు పలుకకపోయెనఁట.

సుస—అతఁడును ద్రోహులలో నొకఁడుకాఁడా. ఎందుకు పలుకును. అయినను నాతఁడు తూష్ణీంభావము వహించి యుండుటఁ జూడ నాతఁడు శ్రద్ధానేనుని మాయాజాలమందు బలవంతముగాఁ జిక్కుకొనినాఁడని విశదమగును.

ఓరీ ప్రశస్థకులశుఁ డింకేమైనఁ జెప్పెనా?

సేవ—అయ్యా! తత్క్షణమే రమ్మని చెప్పిరి. గర్గచంద్రులు సైన్యముతో సిద్ధముగా నున్నారు.

సుస—(స్వ) ఈ దుర్మార్గద్రోహుల నందఱఁ బరిమార్చినఁగాని నాక్రోధము శమింపదు.

ఉ. ధారుణికంపమొందిన* వితస్థయు వేలల దాటివచ్చినన్
¶ మేరునగంబు గూలినను మిక్కిలి సంపద గల్గినట్టికా
శ్మీరము నాశనంబయినఁ, జెచ్చెర ద్రోహులఁ జంపివారిహృ
ద్దారణ కర్మఁజేసి వసుధాపతి యాత్మకుఁ దృప్తినిచ్చెదన్.

(ప్ర) ఓరీ! మన సైనికుల నందఱ విడిదినుండి తత్క్షణమే కదలుమని చెప్పుము. ద్రోహులకుఁ గొంచమైన నవకాశమీయఁజనదు.

సేవ—చిత్తము. ఇపుడే మీయాజ్ఞఁ దెలుపుదును. (నిష్క్రమించును.)

---

* వితస్థయనునది కాశ్మీరమందు ప్రవహించు సింధూ నదికి పేరు. దీనినే ప్రాచీన గ్రీకులు (Hydaspes) అని అనుకరణగా జేర్కొనిరి. ఇప్పుడు దీనిని „బియాస్" అందురు.

¶ మేరువు అనగా హిమవత్పర్వతమనియే నా యభిప్రాయము. కాశ్మీరమున కవతలనుండు ఆఫ్గనిస్థానములో హిమాలయము ప్రారంభమగు చోటును పామెమేర్ (Pamir) అనగా మేరువుయొక్క పాదు అని వ్యవహరించుచున్నారు. కాశ్మీరమనగా „మేరువు" యొక్క సం„కాశ" మందుండు దేశమని యర్థముండును.

సుస్స—(స్వ) అన్నా! నీఋణము నెట్లు చెల్లించుకొందునోకదా. పుట్టిననాటఁగోలె నీవెంబడి ఖడ్గహస్తుఁడనై, హర్షరాజుతోడను, డామరాధిపులతోడను, యుద్ధములు చేసి, తుదకు నీ యవసాన సమయమందు నీకు సాయము చేయఁజాలనైతినే' వృథావాక్కులతో నేమి ప్రయోజనము? ద్రోహుల ఖండించు వాక్యములఁ గార్యాచరణములోనికిఁ దెత్తును.

(నిష్క్రమించును)



## తృతీయరంగము



స్థలము — శ్రీనగరము
(గర్గచంద్రుఁడు, ప్రశస్తపలశుఁడు)

గర్గ—వింటిరా, భోగసేన శ్రద్ధాసేనాదు లతివేగముతో సేనా సమేతులై లోహరమార్గము పట్టిరఁట.

క. హరిణంబులు రిపుఁగని బి
త్తరిచూపుల గంతులిడుచు దాటినవిధిస
త్వరుఁడై శ్రద్ధాసేనుఁడు
పురివిడిచెను; లోహరాభి ముఖుఁడై వెడలెన్.

వీరు తమ సైన్యముతో లోహరదిక్కుఁ బోవుటఁజూడ సుస్సల రాజుపై దాడివెడలిరని విశదమగును.

ప్రశ— సేనాధిప, ఇందేమిచిత్రము కలదు? ఈ పంద లెందఱు పోయినను నా సుస్సలరాజొక్కఁడే వీరినిశిక్షింపఁగలఁడు. నేను బలుమారు వేటాడునప్పు డొక ప్రకృతితత్వమును గమనించితిని. పక్షులలోఁగాని చతుష్పాద జంతువులలోఁ గాని బలహీనమై స్వభావభీరువులైనట్టివి మందలు మందలుగాఁ జేరియుండును. కాని శౌర్యముగల సింహాదిజంతువులు, ఖగాదిపక్షు లొంటరిగాఁ దిరుగుచుండును.

గీ. పిఱికి పందలు, చీమలు, భీతమతులు
గుంపులైకూడి శత్రులఁ గొట్టుచుంద్రు
కోకములు పిండుగట్టుక కావుమనును
శ్యేనమెప్పుడు వేటాడు నేకియగుచు.

గర్గచంద్రా! నీవిందింక జాగుచేయనలదు. అతిత్వరితగతిని వారిని వెన్నాడి సమరంబుచేసి నాశనము సేయవలయును.

గర్గ—అవును. నా యభిప్రాయము కూడ నదేవిధముగ నున్నది. నా చమూపతులను గూడ యుద్ధ సన్నద్ధులై తత్క్షణమే ప్రయాణభేరి మ్రోయింప నాజ్ఞాపించినాడను.

(భటుఁడు ప్రవేశించును)

భటు—మహావీర, తమయాజ్ఞాప్రకార మందఱమును సంసిద్ధులమైనారము. మాచమూపతులందఱును దమ యుత్తరువులకై నిరీక్షించుచున్నారు.

గర్గ—మంత్రీ, సేనలతో నేఁడే లోహరమార్గమునఁ బోయెదను. మీా రంతవఱకీరాజ్యమునఁ గల్లోలము లెవ్వియు జరుగకుండునటులఁ జూడవలయును.

పరి—మంచిది. పోయిరమ్ము. దైవము నీయుత్తమకార్యమునకు శీఘ్రమే జయ మొసఁగుఁగాత.



## తురీయరంగము

---

స్థలము—లాహార—తోషామైదానపుఁగనుమ.

(సుస్సలుఁడు-భటులుఁ ప్రవేశింతురు)

సుస్స—ఓరీ! నేఁడిందు మనమలసటదీర్చికొనవలయును. అందఱు ను విశ్రమింపవచ్చును. సుడారములు పాతవలయునని తెలుపుము.

భటు—చిత్తము. భటులందఱకును మీయాజ్ఞను వినిపించెదను.

(ప్రవేశము—ఒకభటుఁడు)

భటు—స్వామీ, ఏదోసైన్యము దూరమునుండి వచ్చుచున్నది.

సుస్స—ఎంతచిత్రము! దానివిశేషము లేవైన గనుగొంటివా?

భటు—సైన్యమనిమాత్రము తెలియుచున్నది. కాని దాని విశేషము లింకేమియుఁ దెలియవు.

సుస్స—(స్వ) గర్గచంద్రుఁడేమైన వచ్చియుండునా? ద్రోహుల ప్రాబల్యము శ్రీనగరమందే యుండగా నతఁడేల నగరమును వారి కప్పగించి యిచ్చుటకు వచ్చును. ఈసైన్యము నిశ్చయముగా ద్రోహులదే. మోసముచే నన్నుగూడ నాశనము సేయఁ దలపెట్టియుందురు. వీరి సాహసము శ్లాఘనీయమైనదే. వెదకఁబోయినతీవె కాళ్లలోఁ బెనఁగినట్లు వీరెంత సునాయాసముగా నాచేతఁజిక్కిరి (ప్రకాశ) ఓరీ! సేవకా, మనసైనికులందఱు చాల జాగ్రత్తతో నుండవలయును. ఆరాణువ యెచ్చటిదో గుర్తింపవలయును. అందఱును వృక్షములందును గుట్టలదాపునను దాగియుండ వలయును. కొందఱు గూఢముగా నాసైన్యమెవ్వరిదో, వారి బలమెంతటిదో యంతయును దెలిసికొని రావలయును. రమ్ము నేను జూపించినరీతిగా చేయుఁడు,

భటులు—చిత్తము. (అందఱు నిష్క్రమింతురు)

(తేజుఁడు, శ్రద్ధాసేనుఁడు, భోగసేనుఁడు ప్రవేశింతురు)

తేజు—అబ్బా, ఉచ్ఛలుఁడు చావకుండిన బాగుండెను. నా చావు దగ్గఱకువచ్చినట్లున్నది. ఈ గుండ్లపై బడి దొర్చుచు మోఁకాళ్లచిప్పలు పోవునట్లుగా నురికి యూపిరితిరుగక బాధపడవలసి వచ్చెను.

శ్రద్ధా—తేజా, నీవేల యూరకే భయపడెదవు.

తేజు—సుస్సలుఁడు వచ్చి మనలఁజంపిన నెట్లు?

శ్రద్ధా—ఎంతటి పిఱికిమాట పల్కితివి!

క॥ యముఁడే యడ్డమువచ్చిన
సమరములో నతనిఁగిట్టి సాధించెడి మా
ర్గమునరయక యూరక భీ
తమనస్కుఁడవై చరింప ధర్మమె తేజా?

తేజా. పోనీ, యిప్పుడు సుస్సలుఁడిక్కడ లేడుకదా! యుద్ధము ప్రారంభమైనప్పుడుకదా నీవు భయపడిన భయపడవలసినది.

భోగ—శ్రద్ధాసేనా! మన మతివేగముగా వచ్చితిమి. లోహర యింకెంతదూరముండును.

శ్రద్ధా—నేటి రాత్రివఱకా భూమిని జేరుదుము. ఇక్కడనిలిచి యుపయోగములేదు. కొంతసేపు విశ్రమించినపిమ్మట మనము లోహరనుజేరి రాత్రియందే సుస్సలునిముట్టడించి యోడింతము.

(నిష్క్రమింతురు)

(సుస్సలరాజు, భటులు ప్రవేశింతురు)

సుస్స—నేఁడెంత యదృష్టసమయము.

క॥ ఏచిన తమిమృగములు వని
గోచరమైనట్టి మృగయులఁగూల్చిన విధి నీ
నీచద్రోహుల జంపి యి
కేచింతయు లేకయుందు నిప్పితమెసఁగన్॥

వీరినఁదఱను బరిమార్చి వీరిరక్తధారలతో నాయగ్రజు నాత్మను దృప్తిఁబఱచెదను: భటులారా, నావెంటరండు. నేఁజూపువిధమున నాచరింపుడు.

భటు—దేవా, మీ యుత్తరువులఁ జేయుదుము.

(నిష్క్రమింతురు.)

( ప్రవేశము. శ్రద్ధానేనుఁడు, తేజుఁడు, )

శ్రద్ధా—హా! యెంత దురదృష్టము. మనవీపున గర్గచంద్రుని సేన, మనయెదుట సుస్సలుని సేనయు, రెంటిమధ్యఁ జిక్కి చిక్కులఁ బడవలసివచ్చెను. ఇంకేదికర్తవ్యము. తానొకటితలఁచిన దైవ మొకటి దలఁచెగఁదా

తేజు—(వడఁకుచు) అయ్యో, ఇంకనాకు దిక్కేది. నన్ను వ్యర్థముగా గుండ్లలో నిఱికించి చంపితివే!,ఇదివఱకే సుస్సలుఁడు నాపై క్రోధము వహించియుండెను. అతని యన్నపై యుద్ధముచేయింపలేదా? దీని నతఁడు మన్నింపఁడు. మన్నింపఁడు, నీచావుసంగతియే మోకాని నేనుజచ్చుట నిశ్చయము. నిశ్చయము. ముమ్మాటికి నిశ్చయము. అయ్యో! అయ్యో! ఎట్టి దుస్థితి సంప్రాప్తమయ్యె.

శ్రద్ధా—బ్రాహ్మణా! నోరుమూయుము, ఏలనీకిట్టి పిరికితనము?

( సుస్సలుఁడు భటులతోఁ బ్రవేశించును. )

సుస్స—ఓరీ, మదాంధ! నిలునిలు! నీగర్వమణఁచెద.

తేజు—అబ్బా! సింహమునోటఁబడితిని. అయ్యో! అయ్యో, ఇంకెందుబోదు? (పాఱిపోవును భటులు వెంబడింతురు.)

శ్రద్ధా—సుస్సలా, ఇద్దఱిలోనొకరు మృతినొందువఱకు సావకాశము. సామర్థ్యముండినఁ బోరుము. లేదా జితోస్మియని వేడికొనుము.

సుస్స—

గీ. ద్రోహివై, ఖడ్గపాణివై, క్రూరమతిని
పితికివై, రాజుఁ జంపిన విధముగాదు
మదవిఘూర్ణమాన జన విమర్దనుండ
నైన నాతోడఁ బోరంగ నగునె నీచ!

ఆహా! ఎంతటి శూరుఁడవోయినీవు. వెనుక పొడిచినంత బాగుగా నెదుటనిలిచి నీకత్తిపోటు చూపింపఁగలవా?

శ్రద్ధా—సుస్సలా! గర్గచంద్రుని కాకకుఁ దాళఁజాలక యానాడు పిక్కబలము చూపించినది నీవేనా? అట్టి శూరశిఖామణి వికావుననే యిట్టి పౌరుషోక్తుల మాట్లాడఁ గలిగితివి.

సుస్స—ఓరీ, నీతోఁ బెక్కుమాటలాడనొల్లను. ఇదిగో నాకత్తి యందే సర్వమును గననగును.

శ్రద్ధా—ఓయీ, నీసాహసమునకు మెచ్చితిని.

గీ. భీమ భంజనోద్దండులౌ వీరవరులఁ
బేర్చి చెండాడు నాతోడఁ బెనగుటెల్ల
మత్త కుంభీంద్ర కుంభస్థ మౌక్తికములఁ
జీల్చు సింహంబు శునకంబు చెనకినట్లు.

సుస్సలా, ఇద్దఱిలో నొకరు మృతినొందువఱకు సావకాశము. (యుద్ధము సేయుచు నిష్క్రమింతురు.)

( గర్గచంద్రుఁడు ప్రవేశించి )

గర్గ—ఆహా! సమరరంగమెంత చిత్రముగా నొప్పియున్నది.

క. ధర డుల్లిపడెడు శిరములు
దొరలెడు మొండెములు నొఱగుఁ దురగంబులునై
కరమొప్పెడు సమరము భీ
కర కాలాంతక విహార కటకంబనగన్.

నా సహాయము లేకయే సుస్సలమహీపాలుఁ డండఱను మట్టుపెట్టునట్లున్నది. (తెరవంకఁజూచి) సుస్సల భూపాలునికిని శ్రద్ధాసేనునికిని జరుగు యుద్ధమెంత ప్రచండము గానున్నది. ఆ శ్రద్ధాసేన హతకుఁడెంత దుర్మార్గుఁడైనను శౌర్యమందు శ్లాఘనీయుఁడే (మరలచూచి) వహ్వా వహ్వా! శ్రద్ధాసేనుని దల యొకయేదెబ్బకు భూమిపై ద్రెళ్లి పడెనే! సుస్సలా! నీవు ధన్యుఁడవు. ధన్యుఁడవు అల్లదుగో చూడసేన, ప్రయాగులు; వీరి నీక్షణమే తుంటలఁజేసి వచ్చెదను.

(నిష్క్రమించును.)

( సుస్సలునిచే వెంబడింపఁబడి తేజుఁడు )

తేజు—సుస్సలభూపా, శరణు, శరణు.

సుస్స—(ఎత్తిన ఖడ్గముడించి) దుష్టా, నాయగ్రజునిజంపి యిపుడు శరణుజొచ్చిన నిన్నుబోనిత్తునా?

తేజు—మహారాజా, నేనేమియుఁ జేయలేదు. ఆ శ్రద్ధాసేనాది దుష్టాత్ములే యంతయుఁ జేసిరి. నేను నాబంధువగు [illegible] ని [illegible]ర్థమై వే[illegible]నుచుంటిని.

సుస్స—(భటులతో) ఓరీ, వీనిని బంధించియుంచుఁడు. శ్రీనగరము చేరినపిమ్మట విచారించి శిక్షించెదను.

భటు—చిత్తము. ( తేజు నీడ్చికొని పోవుదురు.)

( గర్గచంద్రుఁడు-చూడసేన, ప్రయాగులతలలతో ప్రవేశించును. )

గర్గ—జయము జయము మహారాజునకు

సుస్స—గర్గచంద్రా, ఇప్పుడేవచ్చితివా?

గర్గ—చిత్తము. మఱియుఁ దమకీ యమూల్యవస్తువులఁ గానుకగా సమర్పించుకొంటిని.

సుస్స—ఏమిది, గర్గచంద్రా

గర్గ—దేవా! ప్రయాగ, చూడసేనలనిప్పుడే వధించి వారితల లందెచ్చితిని.

సుస్స—ఓయీ, నేను వేటాడవలసిన జంతువులనీవు చంపితివే?

గర్గ—ఎవరుచంపినను మీకేకదా కడపటిజయము

సుస్స—ఇంకను ద్రోహులుకొందఱు దొఱకినవారుకారు.

గర్గ—వారి డామరసైన్యముదిక్కు దిక్కులం బారుచున్నది. ఇంకవారు చిక్కక యెచటికేగెదరు. నలుదిక్కుల మనసైన్యము చుట్టియున్నది.

సుస్స—ఇప్పుడే వారి జీవననాటకమును ముగించెదము, రమ్మీ.

(నిష్క్రమింతురు.)

(భోగసేనుఁడు ప్రవేశించును.)

భోగ—(స్వగతము) కాలమా! ఎంతలో నెంతమార్పు కలిగించితివి. స్నేహితులందఱును యుద్ధమందు మరణించిరి. ఇంక నేనొక్కఁడను జీవించియేమిచేయఁగలను. జీవింపఁగోరినను సుస్సలుఁడు నన్ను బ్రదుకనిచ్చునా? బ్రదుకనిచ్చెనుబో లోకములో నవమానితుఁడనై యేరీతి జీవచ్ఛవంబనై జీవింతును. ఈ వృథాచింతలచే లాభములేదు.

ఉ. ఎందఱు పాంచరీ జగతి హీనపుఁ జావున వ్యాధిపీడచే
నెందఱు వృద్ధులై మడియరీ మహికిం గురుభార భూతులై
యందఱరీతిగాక్ష్మావిపదబ్ధి తరంగ నిమగ్న భూప్రజా
బృంద సహాయనై తనువుఁ బ్రీతి సమర్పణ చేయఁగల్గినన్.

ఈ సుస్సల గర్గచంద్రుల హస్తములంబడి యవమానమొంది క్రూరముగాఁ జంపఁబడుటకన్న నాత్మహత్యఁ జేసికొనుటయేమేలు.

తే. గీ. వీరులందఱు గూలిరి పోరువందు
పారిపోయిరి డామరుల్ పందలగుచు
సమరలక్ష్మిని జేపట్టె క్ష్మావరుండు
మృత్యు వొక్కఁటె నాకింక మిగిలె నకట.

ఆలస్యముచేసిన రాజుచేఁ జిక్కుదును. ఉచ్ఛ్వలా! నీయాత్మ యింకను బ్రబలమై నా వెంటనంటినట్లున్నది. ఖడ్గమా! నీవొక్కఁడవె నాకు విశ్వాసపాత్రుఁడవు.

గీ. ధైర్యమునకు మూలంబు; సాధనము సిరికి
శత్రువుల పాలికాల భుజంగమంబు
ఆత్మ సంరక్షణంబున నాప్తభటుఁడు
నయిన హేతి నాకిపుడు సహాయమయ్యె.

ప్రియమైన ఖడ్గమా. నన్నాలింగనముచేసికొనుము. ఓ దేవ దేవ! జగదీశ. సకల సంకట సంహారకా! మాపాపము క్షమించుగాత. (పొడుచుకొని) హా! మహాదేవ

(క్రిందఁబడి మృతించును)

( గర్గచంద్రుఁడు, సుస్సలుఁడు, భటులు ప్రవేశింతురు. )

సుస్స—భూతభిక్షునితో శత్రువర్గము ముగిసినట్లే. కాని భోగసేనుఁడుమాత్రము నాకగపడలేదు. (భోగసేనునిజూచి) ఇదే మిక్కడ. ఎవ్వరో ఆత్మహత్య చేసికొనినట్లు కనఁబడు చున్నది.

గర్గ—అయ్యో, భోగసేనుఁడే! మానియై తానే పొడుచికొని చచ్చినవాఁడు. ఈ ద్రోహులందఱిలో నీతఁడుత్తముఁడు. శ్రద్ధాసేనాదుల దుర్బోధలకు లోనై యితఁడు చెడిపోయెను. పాపము ఇతఁడు బ్రతికియుండిన క్షమించియుందుము కదా.

మన్న—గర్గచంద్రా, పశ్చాత్తాపమున కిది సమయము కాదు. మనకార్యమిచట ముగిసిపోయినది. ఈ తోషా మైదానపుంగనుమను దాటి యింక శ్రీనగరమును జేరుదము. అందు దుష్టబుద్ధు లెవ్వరో వారినడంచి దేశమునకు క్షేమముకలుగఁజేయుదము. మఱియు నీ ద్రోహుల తలలన్నిటిని దెప్పించి మనరాజ్యమున చతుర్దిశలందు వీధులలో వ్రేలాడఁగట్టించుము. రాజద్రోహమునకగు ఫలితమును గుర్తించి లోకులు భీతితో వర్తిల్లుదురుగాక.

గర్గ—చిత్తము. మీయుత్తరువుల ప్రకారమే చేయుదును. తాము ముందరుగుఁడు. నేనీ భోగసేనుని కళేబరమునకు దహన సంస్కారములు చేసివచ్చెద.

మన్న—కానిమ్ము. జాగు సేయకుము. (నిష్క్రమించును)

గర్గ—(భటులతో) ఓరీ, ఈతని దీసికొనిపోయి మైదానమందుంచి చితిని సిద్ధము చేయుఁడు.

(భటులు శవముతో నిష్క్రమింతురు.)

జగద్రక్షకా సమస్త ప్రజలరక్షించి రాజుల సన్మార్గమవలంబించునటుల, ననుగ్రహింపుము.

మత్తకోకిల

ఈ వసుంధరనుండు లోకుల హీనసౌఖ్యము నొందగా
దేవదేవ! మహేశ? శంకర! దివ్యవిగ్రహ! ప్రోవవే
కావవే ధర హైందవాసుల కష్టజాలము పాపుచుం
బావనంబగు నార్యభూమి ప్రవర్ధమానము గాంచఁగన్.



# శుద్ధపత్రిక

| పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|
| ౨౯ | యిలజంబుకంబు | యలజంబుకంబు |
| ౩౦ | మితముమారుచు | మితముమీరుచు |
| ౩౧ | బాధించుచున్నారు | బాధించుచున్నాడు |
| ౩౨ | వృద్ధుడు | వృద్ధుడు |
| ౪౨ | పంజ్జులోక | పజ్జులో |
| ౪౩ | వర్ష దార | వర్ష ధార |
| ,, | దూగాడ | దూగాడె |
| ౪౪ | దైర్య | ధైర్య |
| ౪౫ | నాడనుమానించి | నాడవమానించి |
| ,, | ముదంపెను | ముందంపెను |
| ౫౬ | రాజాలకగన్ను | రాజాలకనన్ను |
| ౭౪ | శ్రిదాసేనా | శ్రిద్ధాసేనా |
| ౭౬ | దక్షణమే | దక్షిణమే |
| ౮౩ | దుర్భశము | దుర్భరము |
| ,, | ప్రిజ్ఞాపీడ | ప్రిజాపీడ |
| ౮౪ | జయాజయము | జయాపజయము |

# గోలకొండ పత్రికాలయమున దొరకు గ్రంథములు



| | |
|---|---|
| హిందువులపండుగలు | ౧—౫—౦ |
| (సు. ప్రతాపరెడ్డి కృతము) | |
| సంఘోద్ధరణము ,, | ౦—౬—౦ |
| గయోపాఖ్యానము | ౦—౬—౦ |
| (గోపపరిధాని ప్రాచీనకవి) | |
| కృష్ణాలహరి | ౧—౨—౦ |
| (ప్రాచీన కవిది) | |
| గోలకొండ సంచిక | ౦—౪—౦ |
| చారుమినారు (సచిత్రము పద్యములు) | ౦—౨—౦ |
| రఘునాథ | ౦—౨—౦ |
| రెడ్డికుల నిర్ణయచంద్రిక | ౧—౪—౦ |